# ఉచితం

## తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ గిన్నె

క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం

## రెండు టిన్నులు కొన్నప్పుడు

క్రొత్త ఫారెక్స్ అధిక రుచికరం
క్రొత్త ఫారెక్స్ అధిక సంపూర్ణం

ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు
మీ పాపాయి పెరుగుదలకు మంచిది.




ఈ కానుక ఎంపిక చేయబడిన పట్టణాలలో ప్రత్యేక
కానుక టిన్నులపై సరుకు వున్నంత వరకు లభ్యం.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం – గ్లాక్సో

CLARION/B/GX/5/244 TEL

# నేటి ఆదాయంలో పొదుపు భవిష్యత్తులో బంగారు మలుపు

డబ్బు పొదుపు చేసుకోడానికి ధనవంతులే కానవసరంలేదు వృత్తిపనివారు కూడా పొదుపు చేసుకోవచ్చు ప్రతినెలా 50॥రూల విలువైన జాతీయపొదుపు సర్టిఫికెట్లు ఆరేళ్లపాటు కొనండి. అలా కూడబెట్టిన మొత్తాన్ని 12 ఏళ్లు తిరిగి పొదుపు పథకంలోనే దాచుకోండి. 13వ ఏట నుంచి ఆరేళ్లపాటు ప్రతినెలా 200/- రూ॥లు లభిస్తాయి- అవి మీ ఇష్టం

| ప్రతినెలా మీరు దాచుకొనే డబ్బు | ఆరేళ్లపాటు మీకు నెలనెలా వచ్చే మొత్తం | | | | |
|---|---|---|---|---|---|
| | 6 సం॥లకు | 12 సం॥లకు | 18 సం॥లకు | 24 సం॥లకు | 30 సం॥లకు |
| 50 రూ॥లు | 100 | 200 | 400 | 800 | 1600 |
| 100 రూ॥లు | 200 | 400 | 800 | 1600 | 3200 |
| 200 రూ॥లు | 400 | 800 | 1600 | 3200 | 6400 |
| 300 రూ॥లు | 600 | 1200 | 2400 | 4800 | 9,600 |
| 400 రూ॥లు | 800 | 1600 | 3200 | 6400 | 12,800 |
| 500 రూ॥లు | 1000 | 2000 | 4000 | 8000 | 16,000 |

* ఇంతకు మించి దాచుకోవడం ఉపయోగకరం. ఎందుకంటే ఆ తర్వాత లభించే మొత్తాలు మీ పిల్లలకు అందుకోవచ్చు. ఈ మొత్తాలకు ఆదాయం పన్ను రాయితీ ఉంటుంది కూడా!

వాళ్లు దాచుకోకుండా పనిచేస్తే శ్రమఫలితం పెరుగుతుంది
దాచుకున్న డబ్బుకూడా శ్రమలేకుండా పెరుగుతుంది...





వివరాలకు
కమీషనర్
స్మాల్ సేవింగ్స్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
(ఫైనాన్స్ విభాగం).
హైదరాబాద్ - 500 022
ఫోన్: 224410,
: 222886

# కొత్త లిరిల్
# ఇది తాజాదనపు సరికొత్త అనుభూతి!

లిరిల్ కొత్తదిగా మారింది!
నిలిచి గుబాళించే కొత్త సువాసనతో...
ఆకర్షణీయమైన కొత్త ప్యాక్‌లో!







**లిరిల్**
తాజాదనపు సబ్బు

మిమ్మల్ని నవనారిగా రూపొందిస్తుంది



జగపతి ఆర్ట్ పిక్చర్స్

దాసరి నారాయణరావు




నిర్మాత వి.బి.రాజేంద్రప్రసాద్

సంగీతం: కె.వి.మహదేవన్, పాటలు: ఆచార్య ఆత్రేయ, కెమెరా: సెల్వరాజ్, ఎడిటింగ్: ఎ.సంజీవి, కళ: కె.ఎల్.ధర్



# ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ !

భారత ప్రధాన మంత్రులందరిలోకి శ్రీ రాజీవ్‌గాంధీ అతి చిన్నవారు. ఆయన వయస్సు 40 సంవత్సరాలే. 1981 మే 11న అయిష్టంగానే రాజకీయాలలో ప్రవేశించినప్పటికీ ఆయన తల్లి దివంగత ప్రధాని శ్రీమతి గాంధీ 1984 అక్టోబరు 31న హత్య చేయబడిన అనంతరం 10 గంటల వ్యవధిలో భారత ప్రధానిగా ఆయన పదవిని స్వీకరించారు. రాజకీయాలలో చేరిన మూడున్నర సంవత్సరాలలోనే ప్రధాన మంత్రి కాగలిగారు. ఈ పదవికి ముందు కాంగ్రెసు (ఐ) పార్టీ ప్రధాన కార్యదర్శిగా పని చేశారు. ప్రధాన మంత్రి పదవి చేపట్టిన అనంతరం శ్రీ రాజీవ్ కాంగ్రెసు పార్టీ అధ్యక్షత పదవి కూడా చేపట్టారు. తల్లి శ్రీమతి గాంధీకి తన సహాయం అవసరమని గ్రహించిన శ్రీ రాజీవ్ 1981లో రాజకీయాలలో ప్రవేశించి, సోదరుడు సంజయ్ మృతి కారణంగా ఖాళీ ఏర్పడిన అమేధి పార్లమెంటు నియోజకవర్గం నుంచి, తల్లితో విభేదించిన తమ మరదలు మేనకాగాంధీకి అవకాశం ఇవ్వకుండా, పోటీచేసి మంచి మెజారిటీతో ఎన్నికయ్యారు.

## పరిపాలనా దక్షత !

కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా జమ్ము-కాశ్మీర్ అసెంబ్లీ సీట్ల సర్దుబాట్లు, పార్టీ సభ్యుడు శ్రీ ఎం. ఎం. ఖాన్ వ్యవహారం, ఆంధ్రప్రదేశ్‌లో శ్రీ ఎన్. టి. రామారావును పదవి నుంచి తొలగించడం వంటి వ్యవహారాలలో కొన్ని విమర్శలు ఎదుర్కొన్నప్పటికీ శ్రీమతి ఇందిరాగాంధీ హత్యానంతరం శ్రీ రాజీవ్‌గాంధీ ప్రధాన మంత్రిగా ప్రమాణ స్వీకారం చేయాలని పార్టీ సభ్యులంతా కోరారు. దీనిని 'వారసత్వపు పాలనగా' ప్రతిపక్షాలు ఘోషించాయి. ప్రధాన మంత్రి పదవిని స్వీకరించిన అనంతరం శ్రీమతి ఇందిరాగాంధీ హత్యవల్ల చెలరేగిన హింసాకాండను అణచడంలో శ్రీ రాజీవ్ ఎంతో స్థైర్యాన్ని చూపించారు. ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్‌గా శ్రీ గవాయ్ స్థానంలో శ్రీ ఎం. ఎం. కె. వలీని నియమించడం, మహారాష్ట్ర నుంచి శ్రీ జోగను పోలీసు కమీషనర్‌గా శ్రీ సుభాష్ టాండన్ స్థానంలో నియమించడం వంటి తక్షణ చర్యల ద్వారా ఢిల్లీలో శాంతి పునరుద్ధరింప చేశారు.

## అపూర్వమైన విజయం !

ఊహించని విధంగా శ్రీ రాజీవ్‌గాంధీ నిర్ణీత సమయంలో 8వ లోక్ సభ ఏర్పాటుకు ఎన్నికలు జరపాలని నిర్ణయించారు. అలా జరిగిన ఎన్నికల్లో మునుపెన్నడూ లేనంతగా కాంగ్రెసు ఘన విజయం సాధించింది. పోటీ చేసిన 508 స్థానాలలో 401 స్థానాలు గెలుచుకున్నది. అస్సాం, పంజాబు రాష్ట్రాలలో ఎన్నికలు జరగని విషయం తెలిసినదే. అందరి అభ్యర్థులకన్నా ప్రధాని శ్రీ రాజీవ్ అత్యధిక ఓట్లు సంపాదించారు. అంటే 83.67 శాతం. గతంలో ఏ ప్రధానికీ,కాంగ్రెసు పార్టీకి రానన్ని ఓట్లు వచ్చాయి. 1977లో శ్రీ మొరార్జీ దేశాయికి 83 శాతం ఓట్లు మాత్రమే వచ్చాయి.

శ్రీ రాజీవ్‌గాంధీ ఆగస్టు 29, 1944లో జన్మించారు. బాల్యం అంతా శ్రీ జవహర్‌లాల్ మనుమడిగా ప్రధాన మంత్రి భవనంలోనే గడిపారు. వీరి ప్రాథమిక విద్య సెంట్ కొలంబోస్ స్కూలు, న్యూఢిల్లీలోనూ, డెహరాడూన్‌లోని డూన్ స్కూలు లోను జరిగింది. లండన్ ఇంపీరియల్ కాలేజీలో ఒక సంవత్సరం విద్య నభ్యసించి కేంబ్రిడ్జి ట్రినిటి కాలేజీలో మెకానికల్ ఇంజినీరింగ్ చదివారు. స్కూలు విద్యార్థిగా ఈయన వెనుక బల్లపై కూర్చున్నా తన తమ్ముడు సంజయ్ గాంధీలా గాకుండా ఒక మంచి విద్యార్థిగా పేరు తెచ్చుకున్నారు.

శ్రీ రాజీవ్‌గాంధీకి విమానయానం అంటే తగని ప్రీతి. పాశ్చాత్య, హిందీ శాస్త్రీయ సంగీతం, జాజ్, పాప్ సంగీతం అంటే అభిమానం ఎక్కువ. సాహిత్యం, ఫిలాసఫీ, చరిత్ర అంటే వీరికంత ఆసక్తి లేదు. రాజకీయాలన్నా ఈయనకి అంతగా ఇష్టంలేదు. కాని వాటికి ఇప్పుడు అలవాటు పడిపోతున్నారు.

## నిర్ణయాల్లో దృఢవైఖరి !

శ్రీమతి గాంధీ హత్యానంతరం చెలరేగిన కల్లోలాల నణచడంలో తీసుకున్న నిర్ణయాలు, తమ తల్లికి సన్నిహితులైన శ్రీ ఆర్. కె. ధావన్ వంటి వారిని దూరంగా ఉంచడంవల్లనూ ఆయన గట్టివాడే నన్నది బుజువవుతున్నది. ఇప్పుడిప్పుడే రాజకీయాలు, మంచి, చెడు, తన పార్టీలోని బలహీనతలు, పాలనా వ్యవహారాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. తన మంత్రుల నిర్వహణ తీరును పరిశీలిస్తానని హెచ్చరించడంలో కూడా ఆయన సామర్థ్యం కనిపిస్తున్నది.

ఎన్నికల్లో తన పార్టీ 401 స్థానాలు గెలుచుకొని అమేథీలో అత్యధిక మెజారిటీతో గెలుపొంది అఖండ విజయం సాధించారు. ఇది ఏ ప్రధాన మంత్రికైనా భవిష్యత్తు పట్ల ఆత్మ విశ్వాసాన్ని ఇస్తుంది. ఇబ్బందులు ముందు వున్నప్పటికీ తమ తల్లి శ్రీమతి గాంధీ చక్కగా తీర్చిదిద్దిన ఆర్థిక వ్యవస్థ ఆయనకు సహాయకారిగా సంక్రమిస్తుంది. పంజాబు, అస్సాం సమస్యలను పరిష్కరించాలన్నది ఆయన ప్రధాన ఆశయం. ఈ విషయంలో పంజాబులో అకాలీల ఆనందపూర్ సాహిబ్ తీర్మానాన్ని ఆమోదించేది లేదని స్పష్టం చేశారు.

## ఆర్థిక వ్యవస్థ

ఇటీవల శ్రీ రాజీవ్‌గాంధీ 'టైమ్' పత్రిక కిచ్చిన ఒక ఇంటర్వ్యూలో ఆర్థిక వ్యవస్థ మరింత అభివృద్ధి సాధించేందుకు సహాయపడేందుకు ప్రైవేటు రంగానికి మంచి అవకాశాలు కల్పిస్తామని ఆయన ప్రకటించారు.

కేంద్ర రాష్ట్రాల సంబంధాల విషయంలో కొద్దిపాటి జోక్యంతో ముఖ్య మంత్రులు తమ రాష్ట్రాలను పరిపాలించడానికి అంగీకరిస్తామని అన్నారు. పశ్చిమ బెంగాలులోని కమ్యూనిస్టులు బెంగాలు-

లోని విద్యా విధానాన్నే మార్చేసారని, వాళ్ళు భారత దేశాన్ని గురించి ఆలోచించకుండా మార్క్సిజమ్ గురించి బోధిస్తున్నారని, అది అంత మంచి పద్ధతి కాదని ఆయన అన్నారు

పొరుగుదేశాలతో భారత్ సంఘర్షణా విధానాన్ని అవలంబించదని, భారత విదేశాంగ విధానంలో మార్పు లేదని శ్రీ రాజీవ్ అన్నారు పాకిస్థాన్‌కు ఆయుధాల సరఫరాల పట్ల ఆందోళన వ్యక్తం చేశారు

పోతే అమెరికాలో శ్రీ రాజీవ్‌కు విస్తృత ప్రచారం ఇవ్వబడుతోంది భారత్‌లో పరిణామాలు, అంతర్జాతీయ సంబంధాల పట్ల ఎప్పుడూ అలక్ష్యం చేసే 'టైమ్', 'న్యూస్ వీక్' పత్రికలు ఇప్పుడు శ్రీ రాజీవ్ గురించి విస్తృతంగా పొగుడుతూ రాస్తున్నాయి. ఇది అమెరికాతో సత్సంబంధాల మెరుగుదలను సూచిస్తున్నది జూన్ నెలలో శ్రీ రాజీవ్ అమెరికా పర్యటించనున్నారు

## రాజకీయాలలో పోలిక!

రాజకీయాలలో తమ తల్లితో శ్రీ రాజీవ్‌గాంధీకి పోలిక లేదని చెప్పబడుతున్నది అయితే ఎన్నికల ప్రచారం ప్రారంభంనుంచీ ఆయన వ్యవహరించిన తీరు రాజకీయాలకు ఆయన కొత్త కాదన్న విషయాన్ని ఋజువు చేస్తున్నది సమర్థవంతమైన ప్రతిపక్షం ఏర్పాటు చెయ్యలేని ప్రతిపక్షాలు ఒక సమర్థవంతమైన ప్రభుత్వాన్నెలా ఏర్పాటు చేయగలవని ఆయన విమర్శించారు తమ ఎన్నికల ప్రచారంలో. ఎన్నికల్లో కాంగ్రెసు (ఐ) ఘన విజయం సాధించడమే కాదు శ్రీయుతులు అటల్ బిహారి వాజ్‌పాయ్, రామ్ జెఠ్ మలానీ, చంద్రశేఖర్, జార్జ్ ఫెర్నాండెస్, బహుగుణ, అంతూలే వంటి ప్రముఖ ప్రతిపక్ష నాయకులు ఓటమి చవిచూశారు చరణ్‌సింగ్, జగ్‌జీవన్‌రామ్‌లు మాత్రం ఎలాగో గెలవగలిగారు

## మౌలికమైన మార్పులు!

పరిపాలన విషయంలో శ్రీ రాజీవ్‌గాంధీ అనేక మౌలికమైన మార్గదర్శక ఆదేశాలు ఇచ్చారు అదే సమయంలో ఎన్నో మంత్రిత్వ శాఖలని పునర్ వ్యవస్థీకరించారు యువకులకు, మహిళలకు ప్రోత్సాహకరంగా ఉండేలా శాస్త్ర, సాంకేతిక రంగాలను నూతనంగా సృష్టించి ఓ మంత్రి వర్గం క్రిందికి తీసుకువచ్చి మూడు శాఖలు ఏర్పాటు చేశారు త్వరలో మరికొన్ని మార్పులుండగలవని ఆయన సూచించారు

శ్రీ రాజీవ్ హయాంలో స్వల్ప కాలంలోనే జరిగిన మంచిని ప్రజలు చూడాల్సిన అవసరం ఎంతైనా ఉంది

–ఐ. బి. ఎస్.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

**దేశోద్ధారక కాశీనాధుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు

(1938 - 1972)

శుక్రవారం 22-28 ఫిబ్రవరి, '85

శ్రీ రక్తాక్షినామ సం **ఫాల్గుణ శు. తదియ**

**సంపుటము 77 : సంచిక 25**

సంపాదకుడు

**శివలెంక రాధాకృష్ణ**

| | | |
|---|---|---|
| విడిప్రతి వెల | రు. | 2-00 |
| ఆరు మాసాల చందా | రు | 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు | 111-80 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003




ముఖచిత్రం






## ముఖ చిత్రం

ముచ్చెర్ల అరుణ ముఖచిత్రం ఎంతో ఆకర్షణీయంగా ఉంది

మల్లింబాకం చంద్రశేఖర్‌రావు, నెల్లూరు

● ● ●

నా అభిమాన నటి జయసుధ' ముఖచిత్రం వేసినందుకు చాలా సంతోషము

బొడబళ్ల వెంకటేశ్వరరావు, కొత్తపట్నం

## బాగున్నాయి

25-1-85 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి ముచ్చెర్ల అరుణ చాలా బావుంది ఈ వారం ప్రచురించిన 'అందరూ ఆలోచించండి , ఇదీ ఈ దేశం' కథలు చాలా బావున్నాయి రచయిత్రులకు ధన్యవాదాలు

–శోభన్, శేఖర్, ప్రదీప్, ప్రవీణ్, ఖర్గపూర్

## కదిలించి వేసాయి

జయసుధ ముఖచిత్రంగా వెలువడిన 1-2-85 పత్రికలో కథలు నాలుగూ చాలా బాగున్నాయి ముఖ్యంగా 'మంటలు రేపిన నెలరాజు సబ్బు బిళ్ల కథలు మమ్మల్ని కదిలించి వేసాయి

సి వి నరసింహదాసు, విజయనగరం

## ద్వంద్వ ప్రమాణాలు

డా జయ్‌దుబాషీ తమ వ్యాసం 'విచిత్రమైన ఎన్నికలు'లో (25-1-85) గత పార్లమెంటు ఎన్నికలు ఎక్కువగా ఒక రకమైన వెర్రి ఆవేశానికి లోనై అర్హతలేని పార్టీని, వ్యక్తులను అధికారంలోకి తెచ్చాయనే ఆవేదన వ్యక్తం చేసారు ఈ విషయంలో దుబాషీగారితో పూర్తిగా ఏకీభవిస్తాను కాని విచారించ వలసిన విషయం ఏమిటంటే, దుబాషీ వంటి మేధావులు యిదేరకమైన మరికొన్ని సంఘటనలను ఎంతో గొప్పగా వర్ణించారు ఏ రకమైన వెర్రి ఆవేశంతో దేశప్రజలు కాంగ్రెసును అత్యధిక మెజారిటీతో గెలిపించారో, అంతకన్నా ఘోరమైన మూఢభక్తి, సినీ వ్యామోహంతో ఆంధ్ర-ప్రజలు, ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ పార్టీని గద్దె ఎక్కించారు నల్లడబ్బుతో, సినీ నిగనిగలతో ఏ నాడూ ఉదారంగా ప్రజాసేవ చెయ్యని వ్యక్తిగా వర్ణింపబడేవారు ప్రాంతీయ తత్వాన్ని, మౌఢ్యాన్ని రెచ్చగొట్టి ఉప్పెన కెరటం ద్వారా అధికారంలోకి వస్తే, ఆ వ్యక్తిని గొప్ప రాజకీయ మేధావిగా వర్ణిస్తారు దుబాషీ వంటివారు సిద్ధాంత పరమైన రాజకీయ విజ్ఞతతో కాక కేవలం వేరే రకమైన వ్యక్తి ఆరాధన ప్రలోభంలో పడి, తెలుగు ప్రజలు కాంగ్రెసు పార్టీని ఓడించినంత మాత్రాన ఈ దుబాషీల దృష్టిలో కాంగ్రెసేతర చర్యలన్నీ విజ్ఞతకు చిహ్నాలు! డా జయ్ దుబాషీ వంటి మేధావులు ఈ ద్వంద్వ ప్రమాణాలు విడనాడిన నాడే దేశం బాగుపడుతుంది లేదా, అదే పేజీలో 'చలమ్' చెప్పినట్లు మనకు మిగిలేది, మేడిపండు ప్రజాస్వామ్యమే!

టి ఎస్ రావు, విశాఖపట్నం

## సీరియల్స్

క్రొత్త సీరియల్ రాగసంధ్య" మొదట్లోనే మమ్ములను ఎంతో ఆకట్టుకుంది

కొత్తల ప్రసాదరావు, రాజమండ్రి

## గమనిక

సకాలానికి అందని కారణంగా ఈ వారం న్యూఢిల్లీ లేఖ వెయ్యలేకపోతున్నాము

–సం □

సీరియల్

# రాగసంధ్య

కాశీనాథుని సువర్చలా దేవి

(గత సంచిక తరువాయి)

ఈసారి కారులో శ్రీకాంత్ ఒంటరిగా లేడు పక్కన సంధ్య వుంది కారు హైదరాబాదు వైపు శరవేగంతో దూసుకు పోతున్నది వెనక కారును గురించిన ఆలోచనే లేదు శ్రీకాంత్‌కి సంధ్య ఏమాలోచిస్తున్నదో, ఏం చేస్తున్నదో కూడా అతను పట్టించుకోలేదు కారు ఇంటి ముందు ఆగేసరికి రాత్రి పన్నెండు కావచ్చింది అప్పుడు పక్కకి తిరిగాడు శ్రీకాంత్ పక్కకి ఒరిగి గ్లాస్ కానుకుని నిద్రపోతున్నది సంధ్య ఆమె నైలా లేపాలో తెలియలేదతనికి పమిటమీదుగా మెరుస్తున్న మాంగల్యాలు తనతో ఆమె బాంధవ్యాన్ని గుర్తు చేస్తున్నట్టున్నయి తెల్లని మెడమీద నల్లపూసలు వింత అందాన్నిస్తుంటే శ్రీకాంత్ ఆమెను తట్టి లేపబోయాడు ఎవరో లేపినట్టే లేచింది సంధ్య

సంధ్యా! ఇల్లొచ్చేసింది, దిగుతావా!" తలుపు తెరుస్తూ అన్నాడతను సంధ్య నెమ్మదిగా దిగింది శ్రీకాంత్ తలుపువైపు వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాడు ముసలి నౌకరు రంగయ్య తలుపు తెరిచాడు శ్రీకాంత్ పక్కన సంధ్యను చూచి క్షణం బిత్తరపోయాడు

శ్రీకాంతే అన్నాడు అమ్మగారు పడుకున్నారా'

'అవును 'బాబూ' ఉండండి పిలుచుకొస్తాను' అతనికి అయోమయంగా ఉంది శ్రీకాంత్ గుమ్మానికానుకుని నిల్చుండి పోయాడు అకాల వర్షం లాంటి ఈ పెళ్ళికి అమ్మ ఎంత రాద్ధాంతం చేస్తుందో! ఎంత గొడవవుతుందో! సంధ్య నిర్లిప్తంగా ఉంది సుభద్రమ్మగారు సంభ్రమంగా లేచివస్తూ మెట్లదగ్గరే ఆగిపోయారు, కొడుకుని, కొడుకు పక్క కొత్త అమ్మాయిని మార్చి మార్చి చూసింది సంధ్య మెడలో మాంగల్యాలు కొంతవరకు చెప్తున్నా ఆమెకు సందేహం, విచారం, ఆనందం – రకరకాల భావాలు మనసుని వెల్లువలా ముంచసాగినయి

'అమ్మా! ఈ అమ్మాయి సంధ్య – నీ కోడలు!"

సుభద్రమ్మగారు రెప్పపాటుకాలం కొడుకు ముఖంలోకి చూచి సంధ్యను నఖశిఖపర్యంతం పరిశీలనగా చూచింది

**జరిగిన కథ-5 :** సంధ్య మధులు ప్రేమించుకొన్నారు మధు ఫ్రెండు శ్రీకాంత్ అంటే సంధ్యకు తగని చిరాకు, అసహ్యం. సంధ్య పిన్ని కూతురు గీత గీతను శ్రీకాంత్‌కిచ్చి పెళ్లి చేస్తే బాగుంటుందని పిన్ని సుందరమ్మ ఆలోచన మూర్తికి పెళ్లి అయిందని తెలుసుకొన్న గీత బాధ పడుతుంది మధుకు నాగపూర్‌లో ఉద్యోగం వచ్చింది మూర్తి తన భార్య ఛ్ఛిదని గీతతో చెప్తాడు మధు చెల్లెలు భవిష్యత్తు బాగుకై మాధవిని పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకున్నట్లు శ్రీకాంత్ సంధ్య వాళ్లతో చెపుతాడు గీతను మూర్తికిచ్చి పెళ్లి చెయ్యమని సలహా ఇస్తాడు శ్రీకాంత్, మధు నుంచి సంధ్యకు వచ్చిన ఉత్తరం గీత చదువుతుంది. ఇష్టం లేకపోయినా గీత భవిష్యత్తు కోసం శ్రీకాంత్‌ను పెళ్లి చేసుకోను ఒప్పుకుంటుంది సంధ్య గీత, మూర్తి - సంధ్య, శ్రీకాంత్‌ల పెళ్లి జరిగిపోయింది.

, ఇక్కడే ఉండండి!" చటుక్కున లోపలికి వెళ్ళిపోయిందావిడ పది నిముషాల తర్వాత రాములమ్మ, మంగి హారతితో వచ్చారు వాళ్ళూ ఆ ఇంట్లో ఎంతో కాలంగా ఉంటున్న పనివాళ్ళు దిగదుడిచి హారతిచ్చి సంధ్యను లోపలకు తీసుకెళ్ళారు

బాబుగారూ! అమ్మగారు మీతో విశ్రాంతిగా రేపు మాట్లాడతారట మిమ్మల్ని పైన గదిలో విశ్రాంతి తీసుకోమన్నారు – అని రాములమ్మ వెళ్ళిపోయింది

స్నానం చేస్తారా అమ్మాయిగారూ! మంగి దగ్గరగా వచ్చి అడిగింది శ్రీకాంత్ అప్పటికే సగం మెట్లెక్కాడు మంగి మాటలకి వెనక్కు తిరిగి చూచి మంగీ!నువ్వు పైకిరా – ఆమెను కూడా తీసుకురా! అన్నాడు మంగితో సంధ్య తడబడుతూ స్వప్నావిష్కురాలిలా పైకి వెళ్ళింది

శ్రీకాంత్ గదిలో అడుగుపెట్టిన సంధ్యకు ఒళ్ళంతా ఒక్కసారిగా జలదరించింది ఏమిటి? తను ఎక్కడకు వచ్చింది? ఈ గదిలో ఇతనితో ఒంటరిగా – వెపులోంచి ఏదో జరజరా పాకినట్టు ఉలిక్కిపడింది సంధ్య శ్రీకాంత్ గమనిస్తూనే ఉన్నాడు

'ఆవిడకు బాత్‌రూమ్ చూపించు – బీర్వాలోంచి రెండు టవల్సు తీసివ్వు కిందకెళ్ళి అమ్మగారి దగ్గరనుంచి కొత్త చీర తీసుకురా! చూడు– వస్తూ పాలు వెచ్చచేసి తీసుకురా! తన గది ముందున్న వరండాలోకి వెళ్తూ అన్నాడు శ్రీకాంత్

సంధ్య బాత్ రూములో దూరి తలుపు వేసుకుంది ఉప్పెనలా దుఃఖం ఉబికి ఉబికి వచ్చింది రెండు చేతుల్లో ముఖం దాచుకుని ఎంతసేపు ఏడ్చిందో తెలియదు అమ్మాయిగారూ! అన్న పిలుపుతో తలుపు తీసింది మంగి టవల్ అందించింది నాలుగైదు చీరలు చూపించి మీ ఇష్టమొచ్చినది కట్టుకోండి అంది ఎఱ్ఱ బార్డరు తెల్ల వాయిల్ చీర తీసుకుని తలుపు మూసుకుంది సంధ్య, హాలంత ఉన్న ఆ బాత్ రూములో స్నానపరికరాలెన్నో వున్నయి షవర్ తిప్పితే వేడినీళ్ళు వచ్చినయి ఆలోచనలతో వేడెక్కిన బుర్రను తడిపితే తప్ప లాభంలేదనుకుని తలారా స్నానం చేసింది షాంపుతో తల రుద్దుకొని తీరుబడిగా అరగంట తర్వాత తలుపు తీసేసరికి బయట మంగి వినయంగా నిలబడి ఉంది

'ఓ, నువ్వు యింకా నిలబడే ఉన్నావా!' అంటూ బయటకు వచ్చిన సంధ్యను చూచి ఈ రాత్రిపూట తలస్నానం చేశారా! ఆశ్చర్యంగా అంది మంగి మీరిట్టా కూకోండి– తల తుడుస్తాను' సంధ్యను కూర్చొబెట్టి తలతుడిచి చిక్కు తీసింది

పాలు వేడిగా ఉన్నయి–మిరియాల పొడి వెయ్యమంటారా! జలుబు సెయ్యకుండా ఉంటది– శ్రీకాంత్ లోపలికి రావటంతో శ్రీకాంత్‌కి కూడా పాలగ్లాసు అందిస్తూ అంది మంగి

వద్దు– నాకసలు పాలే వద్దు కంగారుగా లేస్తూ అంది సంధ్య

శ్రీకాంత్ కనుసైగ చూచి మంగి వెళ్ళిపోయింది

పక్కనే వున్న సోఫాలో కూర్చున్నాడతను అతని ముందలా నిలబడటం సంధ్యకు చాలా ఇబ్బందిగా ఉంది పానుగాలి, విశాలమైన కిటికీల్లోంచి వస్తున్న గాలి–బార్లుగా, వత్తుగా ఉన్న జుట్టు అదుపు, ఆజ్ఞ లేకుండా ఎగురుతున్నది నల్లని ఆ జుట్టు వంకీలు తిరిగి అల్లరిగా ఎగురుతుంటే శ్రీకాంత్ కళ్ళు తిప్పుకో లేకుండా ఉన్నాడు

ఎంతసేపు నిల్చుంటావ్! కూర్చో" మృదువుగా ఉందతని గొంతు సంధ్య మాట్లాడలేదు ఆ మెత్తని జుట్టులో తల దూర్చి రుద్దుకోవాలనిపిస్తున్నదతనికి

"పొద్దుటి నుంచీ ఏమీ తినలేదు పాలు తాగటానికేం– తాగు' పొడి పొడిగా ఉన్నయి అతని మాటలు

కళ్ళెత్తి చూచిందతనిని! ఆ కళ్ళల్లో భావాలు చదవగలిగాడతను

"సంధ్యా! అర్థం లేని అనుమానాలేవీ పెట్టుకోకు ఈ పెళ్ళి ఏ రకమైన పెళ్ళో నీకూ తెలుసు నాకూ తెలుసు నేనుగా నీ నుంచి ఏమీ ఆశించను ఇది నా ప్రమాణం నువ్వు ధైర్యంగా వుండవచ్చు నేను నీ నుంచి కోరేదల్లా ఒక్కటే మన

ఈ విచిత్ర వివాహం, మన విచిత్ర దాంపత్యం గురించిన విషయం ఈ గదిలో మనిద్దరి మధ్య మాత్రమే ఉండేలా ప్రవర్తించు చాలు కాకపోతే, ఆనాడు మధుకి వీడ్కోలిచ్చే రోజున నా డబ్బుతో ఇచ్చే ఏవీ తీసుకోకూడదని మంచినీళ్ళు కూడా తాగలేదు కాని, ఇప్పుడు జీవితాంతం ఉపవాసం చెయ్యలేవుగా ఈ విషయం నువ్వెలా సమర్థించుకుంటావో! నేను చెయ్యగలిగింది లేదు- పాలు తాగు" నిర్లిప్తంగా అన్నాడతను

మరో ఆలోచన లేకుండా సంధ్య గటగటా పాలు తాగేసింది శ్రీకాంత్ తృప్తిగా చూస్తూ "గుడ్! నాకొక సమస్య నుంచి విముక్తి లభించింది అదుగో నీ మంచం వెళ్ళి పడుకో! నీ మంచం పక్కనే లైట్ ఉంది స్విచ్ అక్కడే ఉంది మంచం వెనకాల పుస్తకాలున్నయి ఆ వుడెన్ తలుపు పక్కకి లాగు కావాలంటే చదువుకో-నాకు నిద్ర వస్తున్నది లైట్ తీసేస్తున్నాను' శ్రీకాంత్ అలసటగా మంచం మీద వాలాడు.

సంధ్య మంచం మీద పడుకుని ఆలోచించ సాగింది తనను కావాలని చేసుకున్న ఈ మనిషి తన వల్ల ఏ సుఖం పొందగలుగుతాడు? ఇతని గదిలో వంటరిగా తనకే ప్రమాదమూ రాదా! మధుతో వంటరిగా ఉన్నపుడు కూడా తననెట్లా చూసేవాడు మర్యాద లేని మనిషి! కళ్ళు అప్పగించి తనని తినేసేట్టుగా చూసేవాడు డబ్బున్నదన్న అహంకారం! అవిదేమిటి? అతని తల్లి అతన్ని మించినట్టున్నది లేకపోతే కొడుకు విలాసాలు తెలిసే ఉండాలి! ఇద్దర్నీ ఒక ఆట ఆడించాలి!తనందుకేగదా ఈ పెళ్ళికి సిద్ధపడింది తన వల్ల సుఖం కాదు గదా సుఖభ్రాంతి కూడా తను కలగనీయదు ఈ వివాహం అతనికొక గుణపాఠం కావాలి! ప్రేమంటే ఏమిటో మధుకి తెలియజెయ్యాలి! ఈ వివాహమనే ఈ యజ్ఞంలో తను బలి పశువు కోరి తనకు తానై యూపస్తంభం దగ్గరకు వచ్చింది. తానూహించని పరిణామమిది! దీనికంతకూ కారణం అతని డబ్బు, ధనమదంతో కళ్ళు కప్పుకొని పోయినయి డబ్బుతో సాధించుకో లేనిది లేదనేగా అతని అభిప్రాయం తెల్లవారుతుంది అతని తల్లికి ఎదురు పడాలి! అసలు తనెందుకు ఎదురు పడాలి! కిందకే వెళ్ళదు, గీత- గీత కూడా కొంత వరకు దీనికి కారణం! సుందరమ్మ- సుందరమ్మ మాత్రం- అసలు ప్రధాన కారణం ఆవిడేనని సంధ్యకు అన్పించసాగింది గదిలో నీలం రంగు బల్బు మసగ్గా వెలుగుతున్నది సన్నగా ఫాను చప్పుడు పడుకునే గది పరికించి చూసింది సంధ్య పెద్ద ఆడంబరంగా లేకపోయినా శ్రీకాంత్ ప్రతివస్తువులోనూ ఉన్నాడా-ప్రతి అణువూ అతని వ్యక్తిత్వానికి దర్పణమా అన్నట్టున్నది యధాలాపంగా పక్కకు చూసింది సంధ్య శ్రీకాంత్ నిద్రపోతున్నాడు ఆ మసక వెలుగులో అతని శరీరఛాయ మరింత అందంగా ఉంది తెల్లని మెడ దగ్గర ఆకుపచ్చని బ్లాంకెట్ తనకి అందం తెచ్చుకుంటున్నది సంధ్య దీర్ఘంగా నిట్టూర్చి నిద్రకుపక్రమించింది

** ** **

గీతను తీసికొని ఇల్లు చేరిన మూర్తికి కొత్త సమస్య ఎదురయింది ఇప్పటికే నిద్ర మాత్రలు ఎక్కువగా వాడటం జరిగిందని రాధకు ఆ మాత్రలు వాడటం మానివేసారు రాధ గొడవ కొంచెం ఎక్కువగానే ఉందని చెప్పాలి ఏదైనా మరీ గొడవ ఎక్కువ చేస్తుంటే మూర్తి వచ్చి ఎదురుగా నిలబడితే ఎందుకోగాని అల్లరి మానేసి బుద్ధిగా ఉండేది రాధ ఇదివరలో ఒకసారి పాలగ్లాసు అత్తగారి మీద వంచేసి కిలకిలా నవ్వసాగింది ఈ పిచ్చి దయ్యం నా పాలిట పడ్డది- ఎట్లాగురా దేవుడా! అని శోకాలు పెడ్తున్న తల్లిని ఓదార్చి మూర్తి గ్లాసుతో పాలు తీసుకొని వచ్చి తాగమనగానే రాధ బుద్ధిమంతురాలులా గటగటా తాగేసింది. ఇప్పటి దారి వేరు, గీతను చూస్తూనే రాధ వ్యవహారం తలకిందులౌతున్నది పెద్దగా అరవటం – ఒక రోజు గీత మీదకి వచ్చింది మరీ ఇంత ఊహించని గీత బెదరి పోయింది మూర్తి కూడా తప్పుచేసిన వాడిలా ఇదివరకులా ధైర్యంగా రాధ ముందు నిలబడి ఆమెను నోరెత్తకుండా చెయ్యలేకపోతున్నాడు. అతనెందు కంత క్రుంగి పోతున్నాడో గీత కర్థం కావటం లేదు యాదగిరి గుట్టనుండి వచ్చిన ఆ రాత్రిని జీవితంలో అపురూపంగా తనెంతో పదిలంగా గుండెల్లో దాచుకోవాలనుకుంది. కాని, ఏంజరిగింది? రాత్రి అందరూ భోజనాలు చేసి పనులు ముగించుకునేసరికి పదిగంటలయింది అత్తగారు శ్రీకాంత్ ఇచ్చిన చీరల్లో తెల్ల బెనారస్ చీర కట్టించి తలనిండా పూలు అమర్చింది గుండెలనిండా అనురాగం నింపుకుని భర్త దగ్గరకు వెళ్ళింది మూర్తి వెలుతురులేని ఆ గదిలో పైకప్పుకేసి చూస్తూ పడుకుని ఉన్నాడు తనే దగ్గరకు వెళ్ళింది. అతను కూర్చోమనలేదు. తనే కూర్చుంది అట్లా ఎంత సేపు గడిచిందో తెలియదు. నిద్రముంచుకొస్తుంటే ఏం చెయ్యాలో తెలియలేదు

"రాధ నిద్రపోయిందా!" పొడిగా ఉందతని గొంతు.

"తెలియదు "

"అక్కడ్నుంచే కదా వస్తున్నావు?"



ఇంతలో వెనక గదినుంచి అత్తగారి కేకలు వినిపించినయి ఆదుర్దాగా ఇద్దరూ పరిగెత్తారు రాధ వంటగదిలో సామానంతా చెల్లాచెదరు చేస్తున్నది అత్తగారు గుమ్మంలో నిస్సహాయంగా నిలబడి అరుస్తున్నది మూర్తి రాధ దగ్గరకు పరుగుపెట్టాడు చేతిలో గిన్నె విసురుకు మూర్తి నుదురు గట్టిగా పట్టుకున్నాడు క్షణంలో తెప్పరిల్లి రాధ రెక్కపట్టుకుని లాక్కొచ్చాడు చాలాసేపు గింజుకుని చివరకు పడుకుంది రాధ రాధ మంచం పక్కనే కుర్చీలో కూర్చున్నాడు మూర్తి ఎదురుగా గుమ్మంలో బొమ్మలా నిలబడి పోయింది తను. కాళ్ళు పీకటం మొదలు పెట్టాయి అలసటగా అత్తగారి పక్కనే ఒరిగి నిద్రపోయింది తెల్లవారింది రెండో రాత్రి వచ్చింది. ఆ రోజు రాధ గొడవ ఆరు గంటలకే ప్రారంభమయింది ఆ రోజు ఆమెకు కొంచెం ఎక్కువగానే నిద్రమాత్రలు తగిలించాడు మూర్తి ఆ రాత్రి గడిచి పోయింది అత్తగారి కళ్లల్లో దిగులు మూడో రోజు మూర్తి సెకండ్ షో సినిమాకు వెళ్ళి రాత్రి ఒంటిగంటకు వచ్చాడు

## రాగసంధ్య

నాలుగో రోజు పొద్దున స్నేహితుడి పెళ్ళి అని వెళ్ళి వారం రోజులకి వచ్చాడు ప్రేమనిండిన కళ్ళతో దిగులుగా గీతను కళ్ళతోనే పలుకరించాడు. కాని మాట్లాడలేదు ఆ మధ్యాహ్నమే బయలుదేరి శ్రీకాంత్ ఎస్టేట్ మేనేజర్‌గా బెంగుళూరు వెళ్ళిపోయాడు ఆ రకంగా గీతకు అత్తగారి పక్కన పడుకోవటం అలవాటయిపోయింది మూర్తి ఇంట్లో లేకపోతే రాధ ఎప్పుడూ నిద్రపోతూనే ఉంటుంది మూర్తికి తెలియకుండా అత్తగారు రాధకి మాత్రలు పాలల్లో కలిపి ఇస్తుంది రాధ నిద్ర పోతే ఆవిడకు భయం గీతకు కూడా భయమే! అందుకే ఆవిడ్ని అంటిపెట్టుకుని కొంగు పట్టుకుని విడవని పసిపిల్లలాగా వెంట తిరుగుతుంటుంది ఆవిడకు కూడా గీతమీద అంతులేని ప్రేమ రెండు పూటలా జడవేస్తుంది పొడుగాటి ఆ జడను అపురూపంగా పెంచుతుంది ఎప్పుడైనా నూనె రాసుకోవటం బద్ధకిస్తే కోప్పడి నూనెరాసి జాగ్రత్తగా చిక్కుతీసి జడవేస్తుంది కొడుకు సంసారం తీరు ఆవిడకు తెలుసు గీత మనసు తెలుసు కొడుకు మనోవ్యధ తెలుసు కాని, ఆవిడ ఏం చెయ్యగలదు అందుకే సాధ్యమైనంత వరకు గీతను ప్రేమగా ఆదరంగా చూస్తూ ఆమెకు మనసు నొప్పి కలుగకుండా ఉండటానికి ప్రయత్నిస్తుంటుంది

'గీతా! ఈ రోజు శుక్రవారం – తలస్నానం చెయ్యి నేను నురుగు వెయ్యనా!' బాయిలర్ దగ్గర నిలబడి కేకవేసింది సీతమ్మ

'అత్తయ్యా! రండి – త్వరగా రండి – ' ఆర్తనాదం వినపడుతుంటే ఒకటే పరుగులో లోపలి కొచ్చిన ఆవిడ భయంతో బిగుసుకు పోయింది రాధ చేతిలో గీత విలవిల్లాడిపోతున్నది గీత జుట్టంతా కుప్పలా పట్టుకొని పీకేస్తున్నది రాధ ఎఱ్ఱబడిన ముఖంతో గీత గజగజా వణికిపోతున్నది రాధ బలం ఆవిడకు తెలుసు గీత అంతం చూడందే రాధ వదలదు ఏం చెయ్యాలో తెలియక రాధనుంచి గీతను విడిపించాలని శాయశక్తులా ప్రయత్నం చెయ్యసాగింది గీత వళ్ళంతా రక్తమే బాధతో గిలగిలలాడిపోతున్నది రాధ భయంకరమైన రూపం చూసేవాళ్ళకు భీకరంగా ఉంది రాధతో పెనుగులాడుతున్న ఆవిడ రాధ తోసిన తోపుకి వెళ్ళి గుమ్మంలో బోర్లగా పడ్డది క్రమంగా గీతకు స్పృహ తప్పి పోవటం మొదలయింది

'రాధా!' సింహగర్జనలాంటి ఆ పిలుపుకి రాధ చేతుల్లో పట్టుకాస్త సడలింది గుమ్మంలో మూర్తి నిలబడి ఉన్నాడు మూసుకుపోతున్న కళ్ళతో ఒక్కంగలో వెళ్ళి మూర్తిని కరుచుకుపోయింది గీత గీత వీపుచుట్టూ చేతులువేసి గీతను గట్టిగా పట్టుకున్నాడు మూర్తి 'గీతా, గీతా' పిలుస్తున్న మూర్తి కళ్ళల్లోకి నిస్సహాయంగా చూస్తూ అచేతనంగా పడిపోయింది గీత 'రాక్షసీ! నా పాలిట శనిదేవతలా దాపురించావు అమాయకురాల్ని నీ పొట్టన పెట్టుకున్నావు? నిన్ను నిన్నిలా వదలకూడదు –' గీతను పడుకోబెట్టి రాధవైపు వస్తున్న మూర్తికి దూరంగా పడివున్న తల్లి కనబడింది ఆదుర్దాగా తల్లివైపు వెళ్ళి బలంగా ఆమెను ముందుకు తిప్పాడు ఆమెలో చలనం లేదు. మూర్తి కర్థమైంది తల్లిపోయింది గీత గీత కూడా తల్లిని వదలి గీతవైపు పరుగెత్తాడు మూర్తి భగవంతుడా గీతనైనా దక్కించు అనుకున్నాడు రాధ వెర్రిగా నవ్వుతూ నిలబడి అందర్నీ చూస్తున్నది మూర్తి గీతను ఒడిలోకి లాక్కుని ఆమె ముఖంలోకి దీక్షగా చూస్తూ రోదించసాగాడు కొంతసేపటికి తెలివి తెచ్చుకుని నీళ్ళు తీసికొచ్చి ముఖం మీద చిలకరించాడు గీత కొద్దిగా కదిలింది మూర్తి ముఖంలో ఒక్కసారిగా వెయ్యి దీపాల కాంతి గుండెల నిండా గాలి పీల్చుకుని గీతను సరిగా కూర్చోబెట్టి నీళ్ళు తాగించాడు పూర్తిగా స్పృహలో కొచ్చిన గీత అతని గుండెలమీద తల ఆనించి వెక్కి వెక్కి ఏడవ సాగింది

'గీతా! ఏడవకు! ఈ దౌర్భాగ్యాన్ని పంచుకోవద్దంటే విన్నావుకాదు ఈ నరకంలో నువ్వు బతకలేవు మీ ఇంటికి వెళ్ళిపో నువ్వు నన్ను నన్ను ఈ అసమర్థుడ్ని వదిలేయి గీతా! మూర్తి గొంతు దుఃఖంతో పూడుకుపోయింది రాధ

ఈ వేళ కూడా ఆఫీసులో
రోజంతా పనే...ఇక యింటికి వచ్చేటప్పుడు,
బస్సులో ఆబ్బ, ఊపిరాడనంత మంది
జనం. అయితే ఏం! ఇంటికి రాగానే స్నానం
చేస్తే హాయిగా ఉంటుంది. ఒక కప్పుడు
హార్లిక్స్ త్రాగితే ఆలసటంతా పోతుంది.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం.

పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్మతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముతున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?

Horlicks
The Great Nourisher




మంచి పుష్టికరమైనది

8241




**ఎమ్. పి. ఆర్. -ప్రొద్దుటూరు**

నా వయస్సు 17 సంవత్సరములు నాకు హ్రస్వదృష్టి వున్నది అక్షరములు దగ్గర పెట్టుకుంటేగాని కనబడవు నేను – 16 పవరుగల అద్దములు వాడుచున్నాను అయినా నాకు అక్షరములు దగ్గర పెట్టుకుంటేనే కనబడతాయి నాకు అందరిలాగ చూపు వచ్చేట్టు లెన్స్‌గాని, ఆపరేషన్‌గాని ఎక్కడచేస్తారో లేక లెన్స్ ఎక్కడ అమరుస్తారో తెలుపప్రార్థన

★ మీరు వెంటనే నిపుణులైన నేత్రవైద్యులను కలిసి సంప్రదించండి కెరటో కోనస్ అనే రోగం ఉంటే హ్రస్వదృష్టి లోపం వెంటవెంటనే అధికం అవుతూ ఉంటుంది నేత్రవైద్యులు పరీక్షచేసి దీనిని నిర్ణయిస్తారు కాన్‌టాక్ట్ లెన్సులు నేత్రవైద్యులు సిఫారసు చేసినప్పుడు అన్ని పెద్ద పట్టణాలలో ఉన్న కళ్ళజోడు షాపులలో అమర్చటం జరుగుతుంది అయితే వీటిలో చాలా రకాలున్నాయి వైద్యుల పర్యవేక్షణ అవసరం

**పి ఎన్. ఆర్. - విజయనగరం**

నా వయస్సు 16 సంవత్సరములు నేను చాలా సన్నంగా వుంటాను నాకు లావెక్కాలని కోరిక వున్నది లావెక్కటానికి ఏ ఏ ఆహార పదార్థములు ఎక్కువగా తినవలెను లావెక్కకపోవటానికి కారణాలేమిటి?

★ శరీరం లావెక్కటం అన్నది తినే ఆహారంమీద, మానసిక పరిస్థితుల మీద, హార్మోనుల పనితనం మీద, శరీరంలో ఉన్న ఇతర రోగాలమీద ఆధారపడి ఉంటుంది

పౌష్టికాహారం ఎంత ఎక్కువ తీసుకున్నా లావెక్కని వారు చాలామంది ఉంటారు ప్రోటీన్లు, క్రొవ్వు అధికంగా ఉండే ఆహారపదార్థాలను తీసుకొంటే లావయ్యే అవకాశం ఉంది కానీ ఇది అందరికీ వర్తించదు

లావు అనేది వంశపారంపర్యంగా వస్తూ ఉంటుంది లావుగా ఉన్నంతమాత్రాన ఆరోగ్యవంతులని, సన్నగా ఉన్నంత మాత్రాన రోగిష్టివారని అర్థంకాదు

**జి. ఆర్. బి –**

నావయస్సు 17 సంవత్సరములు ఇంకా వివాహము కాలేదు నాకు టి బి వచ్చింది స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షనులు 90 వాడాను సంవత్సరము నుండి మాత్రలు వాడుచున్నాను ఇంకా ఎన్నాళ్ళు ఈ మందులు వాడాలి? బలహీన మైతే మళ్ళీ వచ్చే సూచనలున్నాయని అన్నారు అది నిజమేనా?

★ వైద్యులు రోగి పరిస్థితిని పరీక్ష చేసి , ఎక్స్–రే, కఫ పరీక్ష మొదలయినవి చేసి, మందులను ఎప్పుడు వాడవలసిందీ చెప్పటం జరుగుతుంది

పూర్తిగా నయమయ్యే దాకా మందులని మానకూడదు రో[illegible] శరీరం బలహీనమైనప్పుడు ఏ రోగమైనా వచ్చే అవకాశం ఉంటుంది. పూర్తిగా నయమయిన వెనువెంటనే క్షయ వచ్చే అవకాశాలు తక్కువ □

## రాగసంధ్య

వీళ్ళని చూస్తూ విరగబడి నవ్వటం మొదలు పెట్టింది మూర్తి క్షణం ఆలోచించాడు గీతను మరింత దగ్గరగా పొదవి పట్టుకున్నాడు దూరంగా తల్లి పడివున్నది గీతను తీసుకొని తల్లి దగ్గరకు వెళ్లాడు అత్తగార్ని చూచిన గీత దుఃఖం పట్ట నలవి కాకుండా పోయింది అతి స్వల్ప కాలంలో తల్లిని మరిపించిన అమృతమూర్తి తన ఈ అంధకార సంసార జీవితంలో ఒకేఒక చిరుదీపం ఎవరి అండ చూచుకుని జీవిస్తోందో ఆ ఒక్క ఆధారమూ తనకు లేకుండా పోయింది భయంతో బిగుసుకుపోతున్న తనను లాలించి ఆకలి తీర్చి నిద్రపుచ్చి కంటికి రెప్పలా కాచుకున్న దయామయురాలు – తన ఈ దురదృష్టకరమైన జీవితాన్ని చూడలేక అలిసిపోయినట్లుగా పడుకుని వునన అత్తగార్ని తదేకంగా చూస్తూ నిస్సహాయంగా రోదిస్తున్న గీతను ఎన్నో రకాలుగా ఓదార్చాడు మూర్తి ఏమనుకుందో ఏమో రాధ ప్రాన్పడి పోయినట్టు చూస్తూ కూర్చుండిపోయింది కొంతసేపటికి తను కూడా వెక్కి వెక్కి ఏడవసాగింది మూర్తి పాలిట దైవంగా శ్రీకాంత్ వచ్చాడు మూర్తికి శ్రీకాంత్‌ని చూడగానే వెయ్యి ఏనుగుల బలం వచ్చింది అంత బాధలోనూ అతని హృదయంలో ఆనందం తళుక్కుమన్నది సమస్త భారమూ శ్రీకాంత్ తన నెత్తి మీదే వేసుకుని జరగవలసిన కార్యక్రమం జరిపించాడు ఎంత ప్రయత్నించినా సంధ్యను మాత్రం తీసుకురాలేకపోయాడు గీత వంటరిగా ఉంది రమ్మని బ్రతిమాలాడు కాని, సంధ్యరానని మొండికెత్తింది తల్లిని తీసుకు వెళ్తున్న సమయంలో గీతను రాధతో వదలి వెళ్ళటానికి మూర్తికి ధైర్యం చాలలేదు శ్రీకాంత్ గీతకు తోడుగా ఉన్నాడు అన్నీ జరిపి ఇంటికి వచ్చేసరికి సాయంత్రం ఆరు గంటలయింది ఇంట్లో వంటలు లేవు చేసే వాళ్ళెవ్వరూ లేరు పక్కింటి వాళ్ళే వంట చేసి పంపారు రాధకు మూర్తే అన్నం తినిపించవలసి వచ్చింది అన్నం కలిపి ముద్దలు పెడుతుంటే ఎన్నడూ రాధ విషయంలో కోపగించుకోని అతని మనసు కుతకుతా ఉడకసాగింది తల్లిని చంపిన హంతకురాలు! భార్య స్థానంలో ఉండి తననెంత భయంకరమైన స్థితిలో వుంచిందో తలుచుకుంటే అతని ఒళ్ళు గగుర్పొడిచింది ఛ! తనదీ ఒక బ్రతుకేనా! విధి తనమీద పగతీర్చుకుంటుంది లోకంలో రాధ తల్లి తండ్రులవంటి వాళ్ళుంటారా! ఈ విపరీత వ్యక్తులందరూ తనమీద ఎందుకు పగబట్టారు గీతతో తనపెళ్ళి జరిగిన రోజు తల్లి ఎంత ఆనందంగా ఉంది! ఎంత సంబర పడింది! తన జీవితంలో సుఖప్రదమైన రోజులు వచ్చినయ్యని, గీతతో తను ఆనందంగా ఉంటే చూడాలని ఆశపడింది మనుమలు, మనుమరాళ్ళు – వాళ్ళతో ఆడుకోవాలని కలలు కన్నది! దీనికంతకు కారణం ఈ రాధ! తన పాలిట మృత్యువు! మృత్యువుకున్న జాలిమాత్రం రాధకెక్కడుంది? కొద్ది కొద్దిగా తనను మృత్యు ముఖంలోకి లాక్కుపోతున్నది! అసలు గీతను తనెందుకు పెళ్ళి చేసుకోవాలి! గీతతో పరిచయం తనెందుకు పెంచుకున్నాడు! ఎన్ని రకాలుగా చెప్పినా గీత వినలేదు పట్టుబట్టింది రాధను చూస్తూ, రాధ సమక్షంలో తను ఇంకొక స్త్రీతో సంసారం చెయ్యలేడు అది అసంభవం! గీత అర్థం చేసుకున్నా సరే! లేకపోయినా సరే! అది తన బలహీనత! రాధ పిచ్చిది! ఆమెకేం తెలుసు అయినా ఏమీ తెలియని అమె కేదో తెలుసు! గీతమీద రాధకు కసి! అది చూపుల్లో, చేతల్లో వ్యక్తంచేస్తూనే ఉన్నది ఇదివరకులా తనంటే భయపడటంలేదు ఇదివరకు భయపడమని ఎవరుచెప్తే తెలుసుకుంది? ఇప్పుడు ఎవరు భయపడవద్దన్నారు! పిచ్చి రాధకు కూడా ఆలోచనలున్నాయా! ఏమీ తెలియని ఆమెకు ఏదైనా తెలుసా! తన తల్లిపోయినప్పుడు ఏడ్చింది! ఎందుకేడ్చింది? రాధకు తెలియని ఆ స్థితిలో తెలిసే భాగం కొంత ఉండి ఉండాలి మూర్తి ఆలోచనల కంతరాయంగా అతని ఒడిలో పడుకుంది రాధ దూరంగా గోడ కానుకుని కూర్చున్న గీత చూస్తూ నిశ్శబ్దంగా ఏడవసాగింది మూర్తి చూశాడు చూసి ఏం చెయ్యగలడు? రాధ నిద్రపోతుందన్న నమ్మకంలేదు నెమ్మదిగా పడుకోబెట్టి గీతను బలవంతంచేసి తినిపించాడు తను కూడా తిన్నాడు. తల్లిలేని ఆ యిల్లు శ్మశానం లాగానే ఉంది అతని మనసంతా శూన్యంతో నిండిపోయింది

**(ఇంకా ఉంది)**



# అందరూ పొందాలనుకొనేది 'థ్రిల్' అనుభవం

థ్రిల్ పరిమళంతో ఉత్తేజాన్ని పొందండి!
ఉల్లాసంగా ఉండండి!
థ్రిల్! మీకోసం ప్రత్యేక సుగంధ ద్రవ్యాలతో
తయారు చేయబడినది. మీ శరీరానికి మృదుత్వమును,
సహజ సౌందర్యమును పెంపొందింప చేయు సబ్బు
థ్రిల్ ఓ క్రొత్త అనుభూతిని కలిగిస్తుంది.




**థ్రిల్**

పరవశింపజేయు సబ్బు.




కేరళ సోప్స్ అండ్ ఆయిల్స్ లిమిటెడ్.
కాలికట్ - 673 011 కేరళ

పెద్దకథ

# మండుటెండలో మంచుబొమ్మలు

సాయిరమేష్ (రాధ)

(గత సంచిక తరువాయి)

అంతలో దిగింది అందాల వెండీ అపరంజి బొమ్మలా అలంకరించుకుని

నీలిరంగు ఈవినింగు డ్రస్‌కి సరిపోయేటట్లు అదే రంగు హైహీల్స్ పాదుకలు ధరించింది నీలి రంగు గోళ్ళకి పూసుకుని, మేలి ముత్యాల హారం మెడలో వేసుకుని ముస్తాబయ్యింది సువాసన వెదజల్లే అతి ఖరీదైన నీనారిసి పెర్ ఫ్యూమ్ వళ్ళంతా పులుముకుని వచ్చిందేమో గుప్పింది గదంతా ఘాటైన సెంట్ వాసనతో

వెల్ వెల్ వెల్, దేర్ యు ఆర్, ది హోస్టు ఆఫ్ హానర్ అంటూ కుర్చీలోంచి లేచి హుషారుగా పలకరించాడు డేవిస్ మత్తులో మరింత మైమరుస్తూ

మార్గరెట్ చూపుల్లో చెలరేగుతున్న చులకనత్వాన్ని గుర్తించే స్థితిలో లేరు ఎవరూ నవ్వు తెచ్చి పెట్టుకుని నైస్ టు సియు డియర్ అంది మార్గరెట్ కూర్చున్నచోటు నుంచి కదలకుండా చేయి అందించి కరచాలనం చేస్తూ

వెండీ కూడా వయ్యారంగా విరియబోసుకున్న వెంట్రుకల్ని విలాసంగా విదిలిస్తూ థేంక్యూ అంది దెప్పి పొడుపుగా

డేవిస్ దగ్గరికి వచ్చి ఆ చెంగులువ చేయి అందుకుని సుతారంగా మద్దాడి హౌ డుయు డు వెండీ అన్నాడు ఆప్యాయంగా

ఫైన్ హౌ ఆర్ యు ' అంటూ కాస్సేపు కదలకుండా, అందుకున్న చేతిని వదలకుండా నిలబడింది వెండీ, హొయలొలికిస్తూ

రావుగారి ముఖంలో రంగులు మారటం గమనించక పోలేదు మార్గరెట్

వెల్ వెండీ వైడోంట్ యు సిట్ హియర్ అంది భర్త నుంచి ఆ మనసులు దోచే మనోహరిని వేరు చేయటానికి ప్రయత్నిస్తూ

ఎస్ ఆఫ్ కోర్స్ ప్లీజ్ బి సీటెడ్ డెవిస్ చూపులు త్రిప్పకుండా, చాతీ పై బాగంలోంచి తొంగి చూస్తోన్న ఎత్తైన అలివేణి అందాన్ని కోరిక తీరా గ్రోలాడు కళ్ళతో రావ్ నీ అందాల భార్యకి మదురమైన షెర్రీ తెచ్చి పెట్టకూడదూ అన్నాడు ఆఖరికి సందర్భపూర్వకంగా తనను తాను సంబాళించుకుంటూ

తప్పకుండా అంటూ లేచి 'టెల్ మి స్వీట్ హార్ట్ షెర్రీ తెమ్మంటావా లేక యింకేమైనా పుచ్చుకుంటావా అని అడిగారు శంకరరావుగారు కాస్త వ్యంగ్యంగా

'యూజ్ యల్ డియర్ నీకు తెలుసుగా నేనేం తీసుకుంటానో' అంది దర్పంగా, ఆడంబరంగా తన దుస్తులు సర్దుకుంటూ

కోపం పట్టలేక గ్లాసులో కాస్త బకార్డీ ఎక్కువ పోసి, కావాలనే కోకో తక్కువ వేసి అందించాడు శంకరరావు

సొగ్గాకొంచం స్వీకరించి- డార్లింగ్ ఈ మధ్య నీ డ్రింక్‌లో కాస్త కల్తీ వస్తున్నట్లుందే ఈజ్ దిస్ ఓల్డ్ ఏజ్ ఆర్ వాట్ అంది వెటకరించి నవ్వుతూ భర్తవైపు తీక్షణంగా చూస్తూ

వెల వెలపోయారు రావుగారు తప్పు చేసినట్లు తల దించుకుంటూ

యు సిట్ డౌన్ రావ్ ఇప్పుడు నా వంతు అయ్ విల్ ఫెచ్ హెర్ సమ్ కోకో డేవిస్ అడ్డు తగిలాడు, సోఫాలోంచి లేస్తూ

మనిషికి కాస్త వ్యాయామం ఎంతో అవసరం మరి కాలు కదపకుండా కూర్చుంటే వళ్ళు బలవటమే కాదు ఆయుషు కూడా తరుగుతుంది అన్నాడు డేవిస్ యిల్లాలి వైపు యింపుగా చూసి చిన్న చలోక్తి విసురుతూ

వళ్ళు ఎంత బలిసినా వంగి పని చేసుకోగలిగితే చాలు మాట విసిరింది మార్గరెట్

చూశావా రావ్ ఇదీ వరస మంచికెళ్ళితే చెడు ఎదురయ్యిందంటారు యిందుకేనేమో ఫక్కున నవ్వాడు డేవిస్

అయినా అందరి ముఖాల్లో ఏదో తెలియని నిరుత్సాహం తాండవించింది ఆ క్షణం

యు లుక్ మార్వలెస్ అన్నాడు డేవిస్ వుండబట్టలేక, ముఖంలో ముఖం పెట్టి ముద్దుగా చూస్తూ గ్లాసు అందుకుని దేంక్యూ అంది వెండీ ముసి ముసి నవ్వులు నవ్వుతూ

నాకు ఈ లైట్ బ్లూకలర్ అంటే చాలా యిష్టం కాని మేగీకి మాత్రం మెరూన్ రెడ్ అంటే ప్రీతి ఏం చేస్తాం ఎవరి రుచులు వాళ్ళవి

రంగులు రుచులూ ముందే చెప్పివుంటే పెళ్ళి పోస్ట్ పోన్ చేయించి వుండేదాన్నిగా మాట విరిచింది మార్గరెట్, యిరువురి చేష్టలు చెరో కంటితో కనిపెడుతూ

ఎందుకంత కోపం డార్లింగ్ నీ అబిరుచులేమిటో నేను అవగాహన చేసుకోకపోతే అప్పుడు అలాగే అనుకోవచ్చు ఏజ్ ఎ మేటర్ ఆఫ్ ఫేక్ట్ మేగీని కలిసిన మరు క్షణమే నాకు రెడ్ కలర్ మీద రుచి ఏర్పడింది అన్నాడు డేవిస్ బార్య మీద విదేయత బహిరంగం చేస్తూ

ఆ ముక్క చెప్పకపోతే రాత్రికి ఆ దొరసాని ఎంత రాద్ధాంతం చేస్తుందో ఆ భార్యా విధేయుడికి బాగా తెలుసు

మీకు తేలీదేమో కాని రావ్‌కి మాత్రం లైట్ బ్లూ అంటే ఎంత యిష్టమో చెప్పలేను డోంట్ యు ఎగ్రీ డార్లింగ్ ' అంది వెండీ మాట మార్చి, మౌనంగా కూర్చుని ఏదో జపిస్తున్న శంకరరావుగారిని మాటల్లో పెట్టటానికి ప్రయత్నిస్తూ ఆఫ్ కోర్స్ అయ్ డు అన్నాడు ఆ పెద్ద మనిషి అన్యమనస్కంగా చూపుల్లో సింగారం నింపుకుని దర్పంగా చూసింది శ్రోతలవైపు 'చూశారా నా మగడు నా అడుగు జాడల్లో- ఎంత ఒబ్బిడిగా నడుస్తాడో అన్న అర్థం స్ఫురించేటట్లు

రావుగారు మాత్రం ఏమీ పట్టించుకోకుండా, తన గ్లాసులో తొణికిసలాడుతోన్న జంజరేల్ కలిసిన కల్తీ బ్రాందీలో, మునిగి తేలుతోన్న ఆహ్లాదాన్ని త్రవ్వుకొని సొంతం చేసుకోవాలని ఆరాట పడుతున్నారు, గటగడా గుటకలు మ్రింగుతూ

రెండు రోజుల క్రితం అనుకుంటాను నిన్ను సిటీ సెంటర్‌లో చూసినట్లు గుర్తు చాలా షాపింగ్ చేసినట్లున్నావ్

అడగాలా వద్దా అని అప్పటివరకూ సతమతమవుతున్న మార్గరెట్ వుక్రోషం పట్టలేక ఆఖరికి అడిగింది అపురూపమైన ఓ చిరు నవ్వు అడ్డు పెట్టుకుని మర్యాదగా మాటలు తేల్చేస్తూ

సిటి సెంటర్‌లోనా అదెప్పుడబ్బా

మాటల్లో తడబాటు కదలికలో కంగారు దాచుకోలేకపోయింది వెండీ

పొలమారినట్లు గొంతు సవరించుకుంటూ బ్లెస్ మీ అంటూ తనని తాను దీవించుకుంది అందరూ

తన వైపే ఆశ్చర్యంగా చూడటంతో

తర్స్‌డే ఆఫ్టర్ నూన్ రెండు మూడు ప్రాంతంలో మార్క్స్ అండ్ స్పెన్సర్ ముందు నుంచి కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్తున్నావు నీ ప్రక్కన ఎవరో వుంటే ముందు రావేనేమో అనుకున్నాను అంది మార్గరెట్ మధ్యస్థంగా మాటలు ఆపేస్తూ

ఓ అదా పార్టీకి డ్రింకులు కొందామని వెళ్లాను మీరు వస్తున్నారని చెప్పాడు రావ్ ఈ యింట్లో అన్నీ చూసుకోవలిసింది నేనేగా మరి

మార్గరెట్ మౌనం వహించింది ఏ ప్రశ్న వేసి ఆ ప్రసక్తి కొనసాగించాలో అర్ధం కాక తీగ లాగితే డొంకంతా కదులుతుందని భ్రమపడిందే కాని పట్టిన తీగకి ఎన్ని ముళ్ళు వున్నాయో గుర్తించలేదుపాపం ఆ దొరసాని

వాళ్ళ సంభాషణ పట్టించుకోకుండా అప్పుడే ప్రారంభమైన బిబిసి నైన్ ఓ క్లాక్ న్యూస్‌లో



నిమగ్నమయ్యారు మగాళ్ళు యిద్దరూ

ఇంతకీ ఆ రోజు కారులో, నీతో ప్రయాణం చేస్తుంది ఎవరంట "

మళ్ళీ మొదలు పెట్టింది మార్గరెట్ అందరికీ వినిపించేలా ఆసక్తిగా ప్రశ్నిస్తూ వులిక్కి పడడం వెండీ వంతు అయ్యింది- ఎవరి గురించి నువ్వు మాట్లాడుతుంది ఎదురు ప్రశ్న వేసింది వికారంగా నవ్వుతూ

అదే మొన్న నీతో చూసిన మనిషి ఎవరో గుర్తు పట్టలేకపోలేను

అందరూ మనకు తెలియాలి అని ఏమీ లేదుగా దెబ్బ తీసింది వెండీ

'అఫ్ కోర్స్ అఫ్ కోర్స్

అయినా అడిగావు కాబట్టి చెప్తున్నాను నాతో ఆ రోజు కారులో వున్న వ్యక్తి నాకజిన్ అంది ఎత్తి పొడుస్తూ

శంకరరావుగారు చురుకుగా ఓ చూపు విసిరారు శ్రీమతివైపు

బ్రైటన్‌లోనే వుంటున్నాడా మీ కజిన్ కావాలనే కథ నడిపించింది మార్గరెట్ మాటలు వత్తి పలుకుతూ

లేదు కోల్చెస్టర్ నుంచి వచ్చాడు" పొడి పొడి మాటలు పదునుగా వచ్చాయి వెండీ నోటి నుంచి.



మార్గరెట్ రావుగారి వైపు చూసింది ప్రశ్నార్ధకంగా 'నీకోమలాంగి కజిన్ ఎవరో నీకు తెలుసా అన్నట్లు

శంకరరావుగారి చూపుల్లో సినిమా రీళ్ళు తిరుగుతున్నాయి అప్పటికే

యింటికి తీసుకురాలేదే పాపం అన్నారు కలగజేసుకుంటూ

తన పని పూర్తయినట్లు సోఫాల్లో వెనక్కి వాలి కూర్చుంది మార్గరెట్, సుఖంగా

అయ్ డిడ్ యిన్వైట్ హిమ్ బట్ హి వజ్ రేదర్ బిజీ యు సి కంప్యూటర్ యింజనీర్ జాబుకి ఏదో పెద్ద ఫర్మ్ వాళ్ళు యింటర్వ్యూకి పిలిస్తే వచ్చాడు ఇంటికి వచ్చే టైమ్ లేదని ఫోన్ చేస్తే నేనే స్టేషన్‌కి వెళ్ళి కలుసుకున్నాను ఎంతైనా ఫస్ట్ కజిన్ కదా కనీసం వూరైనా చూపించకపోతే బాగుండదని అలా సిటీ సెంటర్‌కి తీసుకు వెళ్లాను దట్సాల్ డార్లింగ్ తేలికగా తీసి పారేసింది వెండీ, ఎర్రని పెదవుల మధ్య వేడి చిరునవ్వు సంధిస్తూ

శంకరరావుగారు సద్దుమణిగారు

వెండీకి అంతరంగంలో ఎనలేని ఆగ్రహం పుట్టుకొచ్చింది, మార్గరెట్ తీసుకున్న చొరవకి మర్యాద అడ్డు వచ్చి వూరుకుందేగాని, లేకపోతే ఓ ఆట

ఆడించి వుండేదీ ఆ దొరసానిని, ఏదో మిషగా పెట్టుకుని

అతి పసందైన యింగ్లీష్ రోస్ట్ చికెన్‌తో ప్రారంభించి ఆ తియ్యని ఆంధ్రుల రవ్వ లడ్డులతో పూర్తయ్యేట్టు ఏర్పాటు చేయించారు శంకరరావు, ఆ విందు భోజనాన్ని

టేబిల్ దగ్గర కూర్చుంటూ మరోసారి వెండీని కవ్వించింది మార్గరెట్

భారతి చేసినట్లే వున్నాయే వంటకాలన్నీ రావ్ నేర్పుతున్నాడా రెసిపీలన్నీ

నీకు తెలీదేమో కాని వంట పనులంటే నాకు- వళ్ళు మంట మరి

చాచి కొట్టినట్టు సమాధానం చెప్పింది, వెండీ మొండిగా

మూతి ముడుచుకుంది మార్గరెట్, ఎత్తిపొడుపుకి తట్టుకోలేక

భోజనాల దగ్గర అందరినీ అడిగి అడిగి వడ్డిస్తూ, అందమైన గాబ్లెట్స్‌లో రుచికరమైన జర్మన్ వైన్ పోసి అందించాడు శంకరరావు, అతిథుల ప్రీత్యర్థం వినసొంపైనా షేడోస్ సంగీతం వినిపిస్తూ

బైది వే వెండీ రిజైన్ చేసినట్లుంది ఏమిటి సంగతి అని అడిగాడు డేవిస్ అప్పుడే గుర్తుకు వచ్చినట్టు

అఫ్ కోర్స్ షి డిడ్ భార్య వైపు చూచారు రావుగారు చిన్నగా నవ్వుతూ

యు సి రావ్ అండ్ అయ్ హేవ్ డిసైడెడ్ టు హేవ్ చిల్డ్రన్ అంది వెండి ముగ్ధంగా నవ్వుతూ

స్ప్లెన్‌డిడ్ ఐడియా డేవిస్ పొగిడాడు

రావ్‌కి పిల్లలంటే చాలా ప్రీతి మరి కట్టుకున్న మగాడి కోరిక తీర్చటం కోసం సొంత సుఖాలు కొన్నైనా త్యాగం చేయకపోతే ఎలా చెప్పండి అందుకే ఆ పురిటి నొప్పిలేవో పడటానికే నిర్ణయించుకున్నాను అంది వెండీ రీవిగా రంగులు పూసుకున్న కనురెప్పల్ని రమ్యంగా రెపరెపలాడిస్తూ

మార్గరెట్ విస్తుపోయి వింటోంది వుదాంతమంతా

గడిచిందంతా గుణిస్తూ కూర్చోటానికి నేనూ, రావూ నూరేళ్ళు బ్రతకగలమో లేదో ఎవరికి తెలుసు సొంత సంతానం అంటూ వుంటే కనీసం వాళ్ళైనా ఎంజాయ్ చేస్తారు ఏమంటారు వేదాంతం వల్లించింది వెండీ

ఏం చెప్పావ్ వెండీ అఫ్ కోర్స్ అయ్ ఎగ్రీ విత్ యు వోంట్ యు డార్లింగ్ , కావాలనే భార్యని వుసికొల్పాడు డేవిస్

శంకరరావు మాత్రం అందరి వూసులూ ఆలకిస్తూ, ఓ గ్రుక్కెడు వైన్‌తో పొడారిన గొంతుకలో అడ్డు పడ్డ ఫ్రైడ్ రైస్‌ని దిగమ్రింగటానికి ప్రయత్నిస్తున్నారు

ఓ ష్యూర్ వై నాట్ ఎవరైనా పిల్లా పాపలతో చల్లగా వుండాలని కోరుకుంటారే కాని ఆలు మగల్ని విడదీయాలని ఆశించరుగా



ఎవరిని వుద్దేశించి మార్గరెట్ ఆ మాటలందో మిగతా ముగ్గురికీ బాగా తెలుసు

"పిల్లలు పుడ్తారని తెలిస్తే పాపం భారతి కూడా నీలాగే కాస్త ప్రయత్నించి వుండేదేమో వెండీ బలహీనత కనిపెట్టి బలమైన మాటల్ని బరువుగా ప్రయోగించింది మార్గరెట్

డేవిస్ లాయిడ్ చివాలున తల ఎత్తి చురుకుగా చూశాడు వ్యర్థ ప్రసంగం యింక చాలించు అన్నట్టు చూపులతో మందలిస్తూ

మాటకి మాట విసరలేక వురిమి వురిమి చూసింది ఆమె వైపు వెండీ, మొండిగా

రావుగారు మాత్రం హరించిపోతున్న హారతి- కర్పూరంలా తనలో తాను కుమిలిపోయారు

ఎక్కడో మస్తిష్కంలో మారుమూల భారతీదేవి రూపం తీవ్రంగా ప్రతిబింబిస్తూ ఆయన ఎదనే ఒక ఎండ మావిగా మార్చేసింది!

*    *    *

హాస్పిటల్‌కి బయలుదేరేముందు వుదయం యింటికి వచ్చే పోస్ట్‌ని ఒకసారి కలయచూడటం ఆయనకి పరిపాటి కాని ఆ రోజు ఎందుకో బద్ధకించారు రావుగారు పనంతా పట్టి మహిషికి అప్పగిస్తూ

బ్రేక్‌ఫాస్ట్ భుజించాననిపించి, నెచ్చెలికి ఓ వీడ్కోలు ముద్దు యిచ్చి క్రొత్తగా కొన్న బెంజ్ కారులో వుల్లాసంగా బయలుదేరి వెళ్ళిపోయారు ఎప్పటిలా ఎనిమిదిన్నరకే

అనుకోకుండా ఆ రోజు పోస్ట్‌మేన్ చాలా బరువు మోసుకు వచ్చి యిచ్చాడు అందులో చాలామట్టుకు చెత్తా చెదారమే వుంది మెడికల్ కంపెనీ వాళ్ళ ప్రకటనలూ, క్రొత్త మందుల వివరాలు తెలియజేస్తూ వ్రాసిన వివరాలే సుమారు అన్నీ రెండో, మూడో మెడికల్ సేంపిల్స్ వున్న పేకెట్టు తప్పించి

ప్రాముఖ్యమైన వుత్తరం ముక్క ఒక్కటీ కనిపించలేదు మొదటి చూపులో ఆ ముద్దరాలికి విసుగెత్తి చేతిలో కట్ట శంకరరావుగారి ఆఫీస్ టేబిల్ మీదికి విసిరింది, లేచి వెళ్ళి, ఆ వూపులో సగట వుత్తరాలు గురి తప్పి క్రింద పడ్డాయి చీదరించుకుంటూ నేల జారిన వుత్తరాల్ని యేర్చి ఒబ్బిడిగా పేర్చే ప్రయత్నంలో పడింది వెండీ ఆ పని చేయకపోతే తన అర్ధ నారీశ్వరుడు సాయంత్రం యింటికి వచ్చీ రాగానే ఎంత అలుగుతాడో ఆ ముద్దుల మగువకి బాగా తెలుసు అందుకే అతడితో లేనిపోని గొడవలు పెంచుకోటం యిష్టం లేక కాస్త నడుం వంచింది ఆ నెరజాణ ఆ సందడిలో ఓ రంగుల కవరు ఆ చిన్నదాని చూపుల్ని ఆకట్టుకుంది అనుకోకుండా మిగతా వుత్తరాలన్నీ ప్రక్కన పెట్టి అసక్తిగా విప్పింది ఆ వుత్తరం, దూర తీరాల నుంచి విమానంలో ఎగిరి వచ్చిందని వెంటనే పసికట్టి

ఇంగ్లీష్ భాషలో రాసి వున్న ఆ వుత్తరం సారాంశం యిది-

డియర్ బావగారు,

అక్క గుండె జబ్బుతో చనిపోయిందన్నది, మమ్మల్ని మభ్య పెట్టటం కోసం మీరు కల్పించిన కట్టు కథే కావచ్చు కాని అక్క ఆత్మహత్య చేసుకుందన్న అసలు కథ ఈ మధ్యే తెలిసింది నిజందాచి మీరు ఎవరికి మేలు చేయదలిచారో నాకు సరిగ్గా తెలీదు కాని అక్క అంత దీన స్థితికి దిగజారటానికి గల కారణం ఏమిటో అంతు పట్టక నేను మాత్రం చాలా సతమతమవుతున్నాను ఒకసారి మీరు యిండియా వస్తే అన్నీ మాట్లాడుకోవచ్చని అనుకుంటున్నాను ఇంత పెద్ద వయసు వచ్చాక అమ్మకీ నాన్నకీ యిలాంటి దారుణ వార్త చెప్తే ఏం జరుగుతుందోనన్న భయంతో నేను యింతవరకూ నోరు విప్పలేదు తమ్ముళ్ళకి కూడా ఈ సంగతి తెలియకుండా వుంచాను మరి అలా అని నేనేదో యిక్కడ నుంచి గూఢచారి వ్యవహారాలు కొనసాగిస్తున్నానని అపోహ పడేరు నిజానికి మీ మీద యింత వరకూ నాకు ఎప్పుడూ సదుద్దేశమే వుంది ఒక వేళ మీరు

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్నీ తొలగిస్తుంది



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

GK&E B84 55 Tel

# శ్రీ నార్ల వెంకటేశ్వరరావు మృతి



ప్రముఖ పత్రికా రచయిత శ్రీ నార్ల వెంకటేశ్వరరావు (76) ఫిబ్రవరి 16 ఉదయం హైదరాబాదులో గుండె పోటుతో మరణించారు. ఈయన కృష్ణా జిల్లాలోని కౌతవరంలో జన్మించారు. 'స్వరాజ్య'లో పత్రికారచనకి శ్రీకారం చుట్టారు. జనవాణి, ప్రజామిత్ర పత్రికలలో పని చేశారు 1942 నించి 1959 వరకూ ఆంధ్రప్రభ సంపాదకుడుగా ఉన్నారు 1960లో ఆంధ్ర జ్యోతి సంపాదకత్వాన్ని చేపట్టారు

పత్రికా రచయితగానే కాక సాహిత్య వేత్తగా, నాటక రచయితగా కూడా మంచి పేరు తెచ్చుకున్నారు జాబాలి, సీతజోస్యం నాటకాలు వివాదాస్పద మైనాయి మావూరు, నేటి రష్యా, పాలస్తీనాలపై వ్యాసాలు రాసి పుస్తకాలుగా ప్రచురించారు వీరేశలింగం పంతులు, వేమనలపై మంచి గ్రంధాలు రాశారు నార్లవారి మాట, జగన్నాటకం, గడ్డ కొత్త పాత రచనలు బహుళ ప్రచారాన్ని పొందాయి శ్రీ నార్ల పత్రికా రచనకి చేసిన సేవకి గుర్తింపుగా ఆంధ్ర విశ్వ విద్యాలయం డాక్టరేట్ ఇచ్చి సత్కరించింది ఈయన రెండు సార్లు రాజ్యసభ సభ్యులుగా పని చేశారు కేంద్ర సాహిత్య అకాడెమి, లలిత కళా అకాడెమి, రాష్ట్ర సాహిత్య అకాడెమీలలో సభ్యులుగా ఉన్నారు ఆంధ్రప్రదేశ్ పత్రికారచయితల సంఘం అధ్యక్షుడిగా కొంతకాలం ఉన్నారు తెలుగు దేశం ప్రభుత్వంలో రాష్ట్ర ప్రభుత్వానికి సాంస్కృతిక సలహాదారుగా శ్రీ నార్ల పని చేశారు మూడు అకాడెమిల విలీనానికి ఆయన సమర్పించిన నివేదిక తీవ్ర విమర్శలకి గురైనందువల్ల ఆయన ఆ పదవినించి వైదొలిగారు

శ్రీ నార్లకి భార్య, ముగ్గురు కుమారులు, అయిదుగురు కుమార్తెలు ఉన్నారు □

శలవు తీసుకుంటాను
ఇట్లు
రామభద్రరావు

ఆమె కళ్ళు అగ్ని గోళాలయ్యాయి చెక్కిళ్ళు ఎరుపెక్కాయి వెండీకి నిజంగా వళ్ళు మండింది ఆ వుత్తరం చదివాక

యు సన్ ఆఫ్ ఎ బిచ్ , హౌ డేర్ యు రైట్ లైక్ దట్

వుత్తరాన్ని గుప్పిటలో వేసి కసి తీరా నలిపింది వుక్రోషం పట్టలేక

ఓ క్షణం కూడా అక్కడ నిలబడలేక విసురుగా లాండ్ బార్‌లోకి వెళ్ళి నెపోలియన్ బ్రాందీ గ్లాసులో పోసుకునే ఓపికలేక సీసా ఎత్తి గడగడా త్రాగేసింది, ఆవేశం చల్లార్చుకోటానికి

ఈ వుత్తరంలో విషయాలు రావుకి తెలిస్తే ఏం జరుగుతుందో?

గతం గుర్తుకు వస్తే చాలు ఎంతో గాభరా పడిపోతుంటాడు అలాంటప్పుడు యిలాంటి వుత్తరం చూశాడంటే మనసు మార్చుకోకుండా వుంటాడని నమ్మకం ఏమిటి? తన మీద మోజు సన్నగిల్లితే తను ఏ మాత్రం సహించలేదు తన గురించి యింత వరకూ అతడికి ఏమీ తెలీదు అనుకోటం శుద్ధ అవివేకం అంతా పసి కట్టి కూడా ఏమీ ఎరగనట్లు ఎందుకలా ప్రవర్తిస్తున్నాడబ్బా ఏదేమైనా సరే యిటువంటి పరిస్థితిలో తను మాత్రం రావుని దూరం చేసుకోకూడదు మరింత మచ్చిక చేసుకుని తగు జాగ్రత్త పడటం తప్పించి తను చేయగలిగింది ఏమీ లేదు ప్రస్తుతానికి?

ఇవీ వెండీ మెదడులో ముసిరిన వూహల మేఘాలు

'వుత్తరం చింపి పారేస్తే' వుసికొల్పింది వగలాడిని ఓ వక్రబుద్ధి

వెంటనే వుత్తరాన్ని రెండు ముక్కలు చేసింది

'నో నో ఈ వుత్తరం దాచి వుంచటమే మంచిది ఎందుకైనా పనికి వస్తుందేమో' తగు జాగ్రత్త తీసుకుంది ఆ తెల్ల దొరసాని తెలివిగా, రెండు ముక్కల్నీ సెల్లోటేప్‌తో ఒకటి చేసి అతికించి బద్రంగా తన బీరువా లాకర్ పెట్టి తాళం వేస్తూ ఆ వుత్తరం చరిత్ర అతడితో ముగించాలని ఆ తరుణీమణి ఆరాటపడటంలో తప్పు లేదేమో?

ఎలాంటి తప్పు చేసినా బహుశా మీ మీద దురభిప్రాయం ఏర్పరచుకోలేనేమో?

మీరు మర్చిపోయినా, అక్కని మీరు మనసారా ప్రేమించారన్న సంగతి నాకు బాగాగుర్తుంది మరి!

ఇంతకీ అక్క ఈ అఘాయిత్యానికి పాల్పడిన సంగతి నా వరకూ ఎలా వచ్చిందని కదూ మీ అనుమానం వర్రీ అవకండి నిజం నిలకడ మీద ఎప్పుడో ఒకప్పుడు బయటపడక మానదు వెనుకటికి ఎవరో అన్నట్లు ఎంతమందినైనా కొంత కాలమే మోసపుచ్చవచ్చు కాని కలకాలం కన్ను కప్పి అందరినీ ఆడించటం అసంభవం ఏమంటారు? అనవసరంగా ఆవేశపడకుండా నా బాధేమిటో కాస్త అర్థం చేసుకోటానికి ప్రయత్నించమని మనస్ఫూర్తిగా వేడుకుంటున్నాను

ఎంతైనా భారతికి తోడబుట్టినవాడిని కదా, పైగా పెద్ద వాణ్ని కూడాను అందుచేత ఆ దురదృష్టవంతురాలి తొందరపాటుకి గల కారణం ఏమిటో తెలుసుకునే హక్కు కొంతవరకూ వుంటుందని మీరు వప్పుకుంటారని ఆశిస్తున్నాను

## మండుటెండలో మంచు బొమ్మలు

వివరాలతో వెంటనే వుత్తరం రాసినా సరే లేదా ఓసారి యిండియా ప్రయాణం పెట్టుకున్నా మంచిదే నేను యింకా పాలకొల్లులో బెల్లం వ్యాపారమే చూస్తున్నాను

అన్నట్లు అడగటం మరిచాను మళ్ళీ మీరు పెళ్ళి చేసుకున్నారట కదా అక్క పోయిన అయిదారు నెలలకో?

అక్క వదిలిపోయిన స్థానాన్ని మీరు ఓ పరాయి దేశస్థురాలికి అంత తేలికగా ఎలా ధారపోయగలిగారో ఆ దేముడికే తెలియాలి కాని భారతి లేని లోటు తీర్చకపోయినా ఆ దొరసాని కనీసం మీ ఆనందాలు, ఆడంబరాలు తీరుస్తూ నిత్యావసరానికి పనికి వస్తుందని ఆశిద్దాం ఏమంటారు?

## సార్థకం!

జీవితపు మలి సంజెలో
వెను దిరిగి చూస్తే
నీ కోసం నిలిచిన నేస్తం,
నీ కోసం విరబూసిన హృదయం,
ఒక్కరైనా, ఒక్కటైనా
మిగిలి వుంటేనే నీ బ్రతుకు సార్థకం!

—"కిరణ్ ప్రభ"







ఆ సాయంత్రం శంకరరావుగారు యింటికి రాగానే ఎదురు వెళ్ళి, ఆయన్ని హృదయానికి హత్తుకుని ఎనలేని ముద్దులతో ముంచేసింది వెండీ వయ్యారం వలికిస్తూ, ఏమీ ఎరగనట్లు నటిస్తూ

ఉన్నట్లుండి వెండీ ఎందుకంత ప్రేమ వలక-బోస్తుందో అర్థం కాక అయోమయంగా చూశారు శంకరరావుగారు పిచ్చివాళ్ళతో 'ప్రొద్దుట నుంచి సాయంత్రం వరకూ సతమతమవుతూ, విసిగి వేసారి యింటికి వస్తే- 'టీ, ఈజ్ ఆన్‌ది టేబిల్ డార్లింగ్ హెల్ప్ యువర్ సెల్ఫ్ ' అంటూ ఏ అమెరికన్ క్రైమ్ థ్రిల్లర్ సినిమానో వీడియోలో వేసుకుని టి వి ముందు కూర్చుని వుండే పత్నీ రత్నం వున్నట్లుండి ఎక్కడ లేని ఆప్యాయతని కుంభ వృష్టిగా కురిపిస్తుంటే ఎవరు మాత్రం నివ్వెరపోరు?

వెల్ వెల్ ఏమిటి విశేషం మంచి హుషారుగా వున్నట్లున్నావ్ అంటూ ఆమెను కాస్త దూరంగా జరిపి పట్టు విడిపించుకున్నారు రావుగారు వుక్కిరి-బిక్కిరి అవుతూ

అయ్ లవ్‌యు సో మచ్ డార్లింగ్ కైపెక్కించే చూపులతో కొంటిగా చూస్తూ ఆయన్ని మరింత అంటుకపోయింది, ఆ అందాల వల్లి అధరామృతం లంచంగా పెట్టి విరబోణి వెచ్చని వూపిరి సోకగానే ఆయన వళ్ళంతా పులకరించింది

అయ్ నో అయ్ నో కలకంఠి కౌగిలిలో యింపుగా యిమిడిపోతూ తనని తాను మరచిపోయారు రావుగారు, క్షణ కాలం

వెయిట్ ఎ మినిట్ స్వీట్ హార్ట్ యింతకీ అసలు కథ ఏమిటో చెప్పావు కాదు సుకుమారి చెంపలు సవరిస్తూ సున్నితంగా అడిగారు, అతృత పట్టలేక డోంట్ బి సిల్లీ డార్లింగ్ ముచ్చటగా మందలిస్తూ కట్టుకున్న వాడ్ని కౌగిలించుకోటం కూడా ఓ కథేనా నీకు యు సిల్లీ మేన్ నేనెప్పుడూ హుషారుగానే వుంటాను నువ్వేమీ పట్టించుకోవుగాని ' అందంగా అలిగింది వెండీ ముద్దరాలి మమకారం కోసం అర్రులు చాచే శంకరరావుగారి మనసు మంచులా కరిగిపోయింది, మరుక్షణమే

ఏం చెప్పాలో తోచక ఆమె... ...వి పట్టుకుని పెదవులు చుంబించారు రావుగారు తనివి తీరా

కమాన్ లెట్ అజ్ హేవ్ సమ్ టీ అంటూ ఆయన చేతులు విడిపించుకుని డైనింగ్ రూమ్ వైపు దారి తీసింది వెండీ మంత్రించబడ్డ మనిషిలా ఆ ముగ్ధ మోహినిని అనుసరించారు రావుగారు మత్తుగా చూస్తూ

అతి విలువైన షిఫాన్ డ్రస్ వేసుకుని చూడ-ముచ్చటగా ముస్తాబయ్యింది వెండీ ఆ రోజు ప్రత్యే-కంగా ప్రపంచ సుందరి పోటీల్లో పాల్గొనే సుంద-రాంగుల స్థాయిలో ఆ పుత్తడి బొమ్మ కూడా ఎవరో శిల్పి నేర్పుగా, ఓర్పుగా చెక్కినట్లు, వంపులు తిరిగి సొంపుగా వుంటుందేమో, ఆ చక్కని దుస్తుల్లో మరింత ఆకర్షణీయంగా కనిపిస్తూ ఏ మగాడికైనా మోహం పుట్టించేటంత అందంగా వుంది

అలాంటి సుకుమారి వున్నట్టుండి ప్రసన్నురాలై వలపు జల్లులు కురిపిస్తుంటే, గుండె నిబ్బరమే కరువైపోతున్న రావుగారు మనోనిగ్రహం కాస్తా కోల్పోవటంలో వింతేముంటుంది?

సన్నని వస్త్రాల్లో దాగలేక సుతి మెత్తని హృదయ కుహరాలు కనువిందు కలిగిస్తుంటే, తను ఎప్పుడో కొని యిచ్చిన వజ్రాల లాకెట్టు వక్షం మీద ఎత్తు పల్లాల మధ్య ఎగిరెగిరి పడుతుంటే, వెండీ మరింత వుద్వేగంతో వూపిరి పీలుస్తుంటే ఎవరికో కుదిర్చిన పిచ్చి తనకు పట్టినట్లు ఫీల్ అయ్యారు రావుగారు

టెల్ మి డార్లింగ్ ఈ రోజు స్పెషల్ ఏదైనా ప్రోగ్రామ్ పెట్టావా ఏమిటి అపురూపంగా నవ్వాయి అర్ధాంగి అందించిన ప్లమ్ కేక్, స్పైసీ టీ సేవిస్తూ

డేవిడ్ ఎసక్స్ కాన్సర్ట్ వుందట బ్రైటన్ థియేటర్‌లో వెళ్దామా ప్లీజ్ అంది ఆ గారాల గువ్వ గోముగా

నీకు తెలుసుగా పాప్ మ్యూజిక్ అంటే నాకు తలనొప్పని

అయ్ నో అయ్ నో బట్ స్టిల్ ఒక్కసారి రాలేవా నాకోసం ప్లీజ్ డార్లింగ్

ఆల్ రైట్

రియల్లీ

వెంటనే ఒప్పుకుంటాడని వూహించలేదేమో కించిత్తు విస్మయం కనబరిచింది వెండీ

స్యూర్ డార్లింగ్ ఫైనాట్ నీ ఆనందంకంటే నాకు కావలసింది ఏముంటుంది చెప్పు మరలు-కొల్పే ముద్దుల మగువ నీలి నేత్రాల్లోకి నిశ్చలంగా చూస్తూ ఎదలో స్పందిస్తోన్న శృంగార తరంగాల దాటికి తట్టుకోలేక కుర్చీలోంచి లేవనెత్తి గట్టిగా వాటేసుకున్నారు వారిజాక్షి వెండీని, అమాంతంగా

మరోగంటలో రావుగారి అవతారం కూడా మారి-పోయింది ఈవినింగ్ బ్లాక్ సూట్ వేసుకుని నల్ల రంగు బౌ పెట్టుకుని, బ్లూ స్ట్రేటస్ బాడీ లోషన్ పూసుకుని ముచ్చటగా ముస్తాబయ్యారు అసలే యింగ్లాండ్ నీళ్ళు పడి కాస్త రంగు తేలారేమో ఆ చక్కనైన దుస్తుల్లో యింకాస్త హుందాగా కని-పించారు ఆ చక్కని చుక్కకి వాత్సల్యం దాచుకోలేక మీద పడి గాఢంగా ముద్దాడింది వెండీ- యు ఆర్ రేదర్ వెరీ స్మార్ట్ స్వీట్ హార్ట్ రియల్లీ రావ్ జస్ట్ లైక్ జేమ్స్‌బాండ్ అయ్ సపోజ్ అని మెప్పుగా అంటూ

కమాన్ డార్లింగ్ ఎంత మొగుడ్నే అయినా మరీ అంత పెద్ద పొగడ్త పనికి రాదు డోంట్ ఎంబార్స్ మి ప్లీజ్ మొగమోటపడ్డారు శంకరరావు బయిలుదేరే ముందు తన ఆఫీస్ గదిలో కి వెళ్లారు ఆయన చెక్ పుస్తకం బేంకర్స్ కార్డ్ తెచ్చుకోటానికి

టేబిల్ మీద పడి వున్న వుత్తరాలు కట్ట ఆకట్టు-కుంది ఆయన్ని క్షణకాలం, త్వరత్వరగా వుత్తరా-లన్నీ ఓ సారి తిరగేసి ప్రత్యేకంగా విప్పి చదవాల్సినవేమీ కనిపించకపోవటంతో అన్నీ టేబిల్ మీదకి గిరాటేసి వెనక్కు తిరిగారు- వెండీ అయామ్ రెడీ అని గట్టిగా అరుస్తూ ఆ వూపులో చెక్‌బుక్ చేతిలోంచి జారి కార్పెట్ మీద పడింది సూట్‌తో అవస్థ పడూ- మై గుడ్‌నెస్ అయామ్ గెటింగ్ ఓల్డ్ అని తనలో తాను నవ్వుకుంటూ ముందుకువం-గారు




**త**నకంటే బలవంతులైన వారివల్ల కలిగే ఆపదను తప్పించుకొనుటకు దేవతలకు ప్రభువైన ఇంద్రుడు బ్రహ్మ మున్నగువారిని తరచుగా ఆశ్రయించేవాడు ఒక్కొక్కప్పుడు యుక్తి పన్ని అపాయాన్ని తప్పించుకునేవాడు యుక్తివల్ల ఉపద్రవాన్ని తప్పించుకున్న గాధ ఒకటి మాంధాతకు సంబంధించింది

మాంధాతృ చక్రవర్తి మహా బలపరాక్రమ సంపన్నుడు భూలోకంలోని రాజులనందరినీ జయించినా అతనికి తృప్తి కలగలేదు ఇంద్రుణ్ణికూడా జయించాలనే కోరిక అతనికి కలిగింది అందువల్ల రాజు స్వర్గంపై దాడి-చేయడానికి బయలుదేరాడు ఈ సంగతి యింద్రుడికి తెలిసింది ఆ మాంధాతను ఎదుర్కోవ డం అసాధ్యమని, యుక్తి-చేతనే అతనివల్ల వచ్చే ఆపదను తప్పించుకోవాలనీ ఇంద్రుడు తగిన ఉపాయం ఆలోచించాడు అతడు మార్గంలోనే మాంధాతను కలుసుకుని "ఓ భూలోక చక్రవర్తీ!నువ్వు నాతో యుద్ధానికి వస్తున్నట్లు నాకు తెలుసును నేనూ దానికి సిద్ధంగానే ఉన్నాను కాని, ఒక సంగతి నీవు రాజులనందరినీ జయించినా, మహా వీరుడు లవణాసురుడు మిగిలి వున్నాడు అతణ్ణి జయించి ఆ వెనుక నాతో యుద్ధానికి రా సిద్ధంగా ఉంటాను" అని అన్నాడు

అతడు లవణుణ్ణి జయించలేడని, అతని దగ్గర ఉన్న శూలాయుధం చేత హతుడు కాగలడనీ ఇంద్రుని నమ్మకం అలా జరిగితే, తనకు అపాయం తప్పుతుంది-గదా!

ఇంద్రుని మాటకు మాంధాత సమ్మతించి వెనుకకు వెళ్ళిపోయాడు లవణాసురుడి తండ్రి మధువు- అతడు మహేశ్వరుణ్ణి గురించి ఘోర తపస్సు-చేసి, అతని అనుగ్రహం పొందాడు శివుడు తన త్రిశూలంవల్ల ఒక శూలాయుధాన్ని సృష్టించి ఇస్తూ, దీన్ని శత్రువుపైకి ప్రయోగిస్తే, ససైన్యంగా అతడు భస్మం కాగలడు ధర్మాన్ని తప్పి యుద్ధం చేస్తే మాత్రం ఇది నన్నే చేరు-తుంది" అని అన్నాడు

మధువు ఆ ఆయుధాన్ని లవణునికి ఇచ్చాడు ఆ ఆయుధం మూలంగా ఆ రాక్షసుడు అందర్నీ హతులను చేస్తున్నాడు ఆ శూలాయుధానికి ఎదురులేదు ఈ సంగతి ఇంద్రునికి తెలుసును అందువల్లనే అతడు మాంధాతను లవణునిపైకి వెళ్ళడానికి ప్రోత్సహించాడు

మాంధాత లవణుని ఎదిరించి, అతడు ప్రయోగించిన శూలం వల్ల మరణించాడు ఇంద్రునికి ఆ రాజువల్ల ఆపద తప్పిపోయింది

–బులుసు వేంకట రమణయ్య

## మండుటెండలో మంచు బొమ్మలు

అనుకోకుండా, ఆ ప్రయత్నంలో చిరిగిన ఓ కవరు ముక్క చిక్కుకుంది ఆయన చూపుల్లో, చెక్ పుస్తకంతోపాటు అదీ అందుకుని ఆసక్తిగా చూశారు సగం చిరునామాతో, యిండియన్ స్టాంపులు అంటించి వున్న ఆ ఎయిర్ మెయిల్ కవరు చూడగానే ఆయన ముఖంలో రంగులు మారాయి

బయటకు వచ్చిన భర్తని చూసి- ఆల్ రైట్ డార్లింగ్ షల్ వుయ్ గో నౌ. అంది వెండీ లాంజ్‌లో డ్రెస్సింగ్ అద్దం ముందు నిలబడి, తన ముస్తాబుకి తుది మెరుగులు దిద్దుకుంటూ

ష్యూర్ అంటూ పరాకుగా జవాబిచ్చి- "హనీ డిడ్ అయ్ హేవ్ ఎనీ పర్సనల్ పోస్ట్ టుడే " అని అడిగారు గుచ్చిగుచ్చి చూస్తూ

వులిక్కిపడింది ఆ వగలాడి, అయినా తొణక్కుండా తనని తాను తమాయించుకుని అద్దంలో కనిపిస్తున్న అర్ధనారీశ్వరుడి వైపు చూపులు కేంద్రీకరించి-

ఒకటీ రెండూ కాదు ఓ డజను వుత్తరాలు వచ్చాయి మరి అన్నీ నీ టేబిల్ మీదే పెట్టాను ఏమైనా వుంటే ఆ కుప్పలోనే వుండాలి అయినా యిప్పుడు ఆగొడవంతా ఎందుకు కాని వచ్చాక చూసుకోవచ్చునులే డార్లింగ్ కమాన్ అంది సమయస్ఫూర్తితో సర్ది చెప్పటానికి ప్రయత్నిస్తూ

అయితే యిండియా నుంచి ఏమీ వుత్తరాలు రాలేదన్నమాట

నో నాట్ దట్ అయ్ నో ఆఫ్ కొట్టిపారేసి శ్రీవారి చేయి అందుకుంది వెండీ విలాసంగా

అయితే యిది ఎప్పటిదో పాత కవర్ అయి వుండాలి అంటూ తేలిక పడ్డ మనసుతో శ్రీమతివైపు చిలిపిగా చూస్తూ చేతిలో వున్న చిరిగిన కవరు ముక్కల్ని డస్ట్ బిన్‌లోకి విసిరారు శంకరరావు

వివర్ణమైన ముఖంలో ఆందోళన దాచకోలేక అవస్థపడింది వెండీ రవ్వంత చిరు నవ్వు రంగు పూసుకున్న బుగ్గల మీద రువ్వుకుంటూ

ఆలస్యం దేనికి వెళ్దామా మైడియర్

ముద్దుల యిల్లాల్ని ముందుకు నడిపించి తీసుకు-వెళ్లారు రావుగారు చెట్ట పట్టుగా చేతిలో చేయి వేసి పట్టుకుని

హేమంతంలో శ్రీమతి చెంపల మీద స్వేద బిందువులు చిరు నాట్యం ఎందుకుచేస్తున్నట్లబ్బా అన్న ఆలోచన శంకరరావుకి కలగకపోలేదు కాని ఆ చిరు చెమటల్లో శంకించాల్సిన తప్పేమి గోచరించ-లేదు ఆయనకి ఆ హడావిడిలో!

**(ఇంకా ఉంది)**

# ప్రపంచ రికార్డు నెలకొల్పిన కూచిపూడి నర్తకి కుమారి సరళ



కుమారి సరళని న్యాయమూర్తి శ్రీమతి కె. అమరేశ్వరి సన్మానిస్తున్న దృశ్యం

తెలుగువారి ప్రత్యేక నృత్య శైలిలో నూతన ప్రపంచ రికార్డును సృష్టించిన ప్రముఖ నర్తకి కుమారి సరళ, 24 గంటలు ఏక దాటిగా విరామము లేక ఫిబ్రవరి 1వ తేది సాయంత్రము ఆరున్నర నుంచి మరునాడు సాయంత్రము 7గంటల వరకు హైదరాబాదు రవీంద్ర భారతిలో వేలాది ప్రేక్షకుల సమక్షంలో నృత్యం చేసింది ఇది ఒక అపురూప ప్రదర్శన కూచిపూడి శైలికి ఇది మరొక దివ్య బంగారు రవ్వలు చెక్కిన కిరీటము

న్యాయమూర్తి శ్రీమతి కె అమరేశ్వరి ఈ నృత్య యజ్ఞాన్ని ప్రారంభించగా, సిరీస్ వ్యాపార సంస్థ అధ్యక్షులు శ్రీ జి ఎస్ రాజు ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు

చక్కని తళ తళలాడే ఆహార్యముతో చిరునవ్వుతో కుమారి సరళ శాస్త్రోక్తంగా, సాంప్రదాయముగా పూజానృత్యము, జతి స్వరముతో ప్రారంభించారు

నర్తకి ప్రదర్శించిన ఒక్కొక్క అంశముతో అట్టే రసికులను ఆ రాత్రి మరుసటి దినమంతయు రజింప చేశారు శివతాండవం రౌద్రరసమును వెదజల్లినది శ్రీయుతులు కొత్లోగాక సుబ్రహ్మణ్యం పాలగుమ్మి విశ్వనాదం రూపొందించిన ఆముక్తమాల్యద నృత్య నాటకం, పంచరత్నకృతి సాధించనే అలమేలు మంగ విలాసములో బ్రహ్మ కడిగిన పాదము ఇప్పుడు ఇమా కలకంటి, అదిగో అల్లదిగో హరివాసము, అలరులు కురియగ కృష్ణ శబ్దం, కొలువైతివా రంగశాయి, బాలగోపాల తరంగం– వీటిని లయ తప్పక, మంచి నృత్య అబినయముతో ప్రదర్శించారు

బామాకలాపములోని దరువులను, లేఖ రచన అప్పుదూరుకు లోనైతివే మీరాబజన్ 'కర్ణాట వసంతరాయలు నృత్య నాటకం, ఇంకా ఎన్నో ఎన్నెన్నో అంశములను పరిపూరముగా నాట్యమాడిరి

వేంపటి ముక్తేశ్వరరావు నట్టువాంగం శ్రీమతి ప్రేమా రామమూర్తి గాత్ర సహకారము, మృదంగంపై అప్పారావు, వయలిన్‌పై రాధాకృష్ణ వేణువుపై నాగరాజు, వీణపై వేళనాగరాజు, జ్ఞాన ప్రసూనాంబ గాత్రము ఈ బృందము 4 గంటలు సహకరించారు అటు పిమ్మట మరొక 4 గంటలు శ్రీ బుద్ధదేవ్ నట్టువాంగం, గాత్ర సహకారం చేయగా మృదంగంపై చిట్టిబాబు, వయలినుపై సూర్యనారాయణ, వేణువుపై దేవర, తబ్లాపై మహమ్మదు మంజూరు సహకరించారు

ఈ రెండు నేపధ్య నాట్య బృందములు 24 గంటలు సహకరించారు నాట్య కళాభారతి, 'నాట్య రత్న

నాట్య మయూరి, నాట్యరాణి, కూచిపూడి అసమాన నర్తకి కుమారి సరళ గ్లూకోస్, కాస్త బ్రెడ్ పండ్ల రసములను మాత్రము పుచ్చుకొని విరామమే లేక రంగస్థలముపై 24 గంటలు నాట్యము చేశారు

ముగింపు సభకు అధ్యక్షులు డా సి నారాయణరెడ్డి, రాష్ట్ర గవర్నరు ముఖ్యఅతిధి, అనుకోకుండ, ఎదురు చూడని ప్రత్యేక అతిధిగా ఉపరాష్ట్రపతి శ్రీ ఆర్ వేంకటర్రామన్ హాజరయ్యారు ఆంధ్రప్రదేశ్ నూతన రికార్డులను స్థాపించుచున్నది నిన్నటి దినమున క్రికెట్టులో వరుసగా మూడుసార్లు శ్రీ అజరుద్దీను వంద పరుగులతో ప్రపంచ రికార్డుతో పాటు, నేడు కుమారి సరళ 24 గంటల నృత్యముతో మరొక నూతన ప్రపంచ రికార్డును సృష్టించింది కధక్ నృత్య కళాకారుడు 18 గంటలు నృత్యముచేసిన రికార్డు బద్దలైపోయింది అని ప్రసంగించారు

ఉప రాష్ట్రపతి సహాయనిది కింద రూ 1,000/ నర్తకికి బహూకరణ ప్రకటించారు

గవర్నరు తన ఆశీస్సులను, అందచేసారు సిరీస్ వాణిజ్య సంస్థ అధ్యక్షుడు శ్రీ జి ఎస్ రాజు రూ 10 116 చెక్కును ఉపరాష్ట్రపతి ద్వారా కుమారి సరళకు బహూకరించారు ఆస్థాన నాట్యాచారునిగా తన్ను నియమించినప్పుడు, తనకు ఇవ్వబడిన కాశ్మీరు సరిగ దుశ్శాల్వను డా నటరాజ రామకృష్ణ నర్తకికి బహూకరించారు

న్యాయమూర్తి శ్రీమతి కె అమరేశ్వరి కుమారి సరళను సాంప్రదాయముగా పూలదండ వాసన ద్రవ్యములు, దుశ్శాలువను కప్పి సన్మానించారు వందలకొలది రసికులు పూలదండలతో సత్కరించారు

ఈ కార్యక్రమానికి 2 రోజుల క్రితం, కుమారి సరళ ఇంటికి ఎవరో దుండగులు ఫోన్‌చేసి, రవీంద్రభారతిలో బాంబు ఉంచామని కార్యక్రమాన్ని రద్దు చేయమని హెచ్చరించారు అప్పుడే పోలీసులకు తెలియ పరిచారు నృత్య ప్రదర్శన నాడు ఏమి జరుగలేదు

నాట్యవేద సంస్థ ప్రధాన అధ్యాపకురాలుగా, విద్యార్థులకు కూచిపూడి నృత్య శాస్త్రమును బోధిస్తున్నారు కుమారి సరళ

– వాసు

## అందాల యువతి నిరసన!

ఇంగ్లండ్‌కు చెందిన టివన్ అనే పట్టణంలో పేవ్‌మెంటుల మీద చిన్న చిన్న దిమ్మలు ఆ కార్పొరేషను కడితే, అవి నడవడానికి అంతరాయంగా వున్నాయని పత్రికలు ప్రజాభిప్రాయాలు రాశారట. అయినా వాటిని తీసెయ్యలేదని 19 ఏళ్ల అన్‌లాట్విన్ అనే అందాల యువతి చిన్న లాగూ తొడుక్కుని, పై బాగం బాహాటంగా వదిలి నడుం సుతారంగా వో గొలుసు కట్టుకుని దాన్ని వో దిమ్మ కట్టేసుకుని, తన నిరసనను కనుల పండువుగ చేసిందట చూపరులకు!

## భారత దేశంలో రోడ్డు ప్రమాదాలు!

భారత దేశంలో యీనాడు ప్రతి నాలుగు నిముషాలకూ వో రోడ్డు ప్రమాదం సంభవిస్తోందట అనగా ప్రతి నాలుగు నిముషాలకూ వో వ్యక్తి ప్రమాదంలో చనిపోతున్నాడట. ఏటికి 350 కోట్ల రూపాయలు ఆర్థిక నష్టాన్ని యీ ప్రమాదాలు తెచ్చి పెడుతున్నాయట

## పాల ఉత్పత్తి రెట్టింపు!

భారత దేశంలో పాల అభివృద్ధి ఎంచక్కా వున్నదట 1951వ సంవత్సరంలో 17 4 మిలియను టన్నుల పాల వుత్పత్తి వుంటే అది 1982 – 83 నాటికి 34 7 మిలియను టన్నులుగా పెరిగిందట

## కుక్కల పేర బాంక్ ఋణాలు!

యు పి గోరక్‌పూరులో విలేజి సహకార బ్యాంకు నుంచి వో రెండు పేర్లకు (ఘగ వారి పేర్లు) ఋణాలు మంజూరు అయ్యాయట ఆనక వారి వివరాల కోసం ఆ వూరి సర్పంచి గారి యింటికి వెళ్తే ఆయన లేరట విచారిస్తే ఆ రెండు పేర్లూ ఆ సర్పంచి గారి కుక్కలవట



## రైలులో బందిపోట్ల భీభత్సం!

వారణాశి నుంచి కలకత్తా వెళ్ళే ట్రైను చంద్రపూరు ప్రాంతానికి వచ్చేసరికి (జనవరి 14 ) ఆ రైల్లోకి బందిపోట్లు జొరపడి ప్రయాణీకుల వద్ద డబ్బూ దస్కం, నగానట్రా అన్నీ వూడ లాక్కున్నారట ప్రతిఘటించిన వో డజను మంది కాళ్ళూ చేతులూ నిర్దాక్షిణ్యంగా నరికి పారేశారట సుమారు వంద మంది గాయాలతో ఆసుపత్రుల పాలయ్యారట

## వర్గ తగాదాల్లో వృద్ధుని హత్య!

దోన్‌కు 25 కిలో మీటర్ల దూరంలో వున్న మారెళ్ల అనే గ్రామంలో 65 ఏళ్ళ రాచగిరప్ప అనే అతన్ని వర్గ తగాదాలలో కొందరు అతి దారుణంగా చంపేశారట మొన్న 21 వ తేదీన హంతకులకోసం పత్తికొండ పోలీసు గాలిస్తోందట

## శివమెత్తిన భక్తుడు!

లఖింపూరుకు చెందిన హాల్‌పూరులో 24 వ తేదీ శివమెత్తిన భక్తుడు వో శివాలయంలోకి దూరి, లోపల గడియ వేసుకుని బెదర కన్నప్పను వగైరాలను తల్చుకుని తన గొంతును కత్తితో పరపర కోసేసు కున్నాడట గుడి బయట భక్తులు గుడి తలుపులు పగలేసి, అతన్ని ఆసుపత్రికి చేరుస్తే వారు మర్గయా అని సర్టిఫై చేశారట – శివుడేమి చేయును!

## ఉంగరాల ద్వారా రోగాలు!

ఆసుపత్రులలో నర్సులు చేతులకు ధరించే నడియాలు, వేళ్ళకు ధరించే నకిలీ వుంగరాల ద్వారా రోగులకు రోగ క్రిములు ఎంచక్కా బట్వాడా జరుగుతున్నావని లండన్‌లోని ఒక ఆసుపత్రికి చెందిన డాక్టర్ల టీము అభిప్రాయ పడిందట ఇది కేవలం అభిప్రాయమేకాదని, కొన్ని వందలమంది నర్సులను రోగులను క్షుణ్ణంగా పరీక్షించి చెప్పిన మాట అని ఆ టీము వో ప్రకటన చేసిందట!

## భర్తని చంపిన ప్రియుడు!

పోళూరు మరుత్తువంబాడి గ్రామానికి చెందిన 27 ఏళ్ళ సూసైనాదన్ బెంగుళూరులో పనిచేస్తూ నెలకోసారి యింటికి వెళ్తూండేవాడట అతని భార్య 23 ఏళ్ల పుష్ప అదే వూరుకు చెందిన భూపాలన్ అనే అతనితో రహస్య కామాయణం పెట్టుకుని సుఖంగా వుందట అనుకోకుండా మొన్న సంక్రాంతికి ముందు రోజు రాత్రి సూసైనాథన్ యిల్లు చేరేసరికి తన భార్య కామవిహారం కళ్లారా చూసి, పెద్ద గలాటా చేశాడట దానికి చుట్టుపక్కల వారంతా హాజరై భూపాలన్ను తిట్టారట ఆ మరునాడు భూపాలన్ తన స్నేహితుని సహాయంతో సూసైనాథనికి పీక మొయ్యా సారా పోయించి, అడివికి పిలిపించి, అక్కడ అతన్ని చంపి, గొయ్యితీసి పాతిపెట్టేశాడట ఆ మర్నాడు కుక్క ఆ ప్రాంతంలో కాళ్ళతో తవ్వడం కొందరు చూశారట దగ్గరకు వెళ్లి చూస్తే మనిషి కాలు బయట పడిందట ఈ విషయంలో పోలీసులు కలుగ జేసుకున్నారట

## అంతర్థానంలోని అసలు రహస్యం!

ఆరణి కొచ్చం పాలయానికి చెందిన అబ్దుల్ వహాబు అనే అతని మనుమరాలు 15 ఏళ్ళ అలీ బున్నీసా 23 వ తేదీ తొమ్మిదో క్లాసు పరీక్ష రాయడానికి వెళ్లి యిక తిరిగి రాలేదట. ఆ పిల్ల మెడలో మూడు కాసుల బంగారు గొలుసు వున్నదట – మరిహ నేం!

## ఆదాయపు పన్ను బకాయిలలో అగ్ర నటీనటులు!

ఆదాయం పన్ను బకాయిలు పెట్టడంలో సినిమా వారిక వారే సాటి హేమామాలిని 18లక్షలు బాకీ అట జితేంద్ర 33లక్షలట రాజ్‌కపూరు 14 లక్షలు, కిషోర్ కుమార్ 18 లక్షలు, కల్పన 18 లక్షలు, శివాజిగణేశన్ 16 లక్షలు, రాజేష్ ఖన్నా 13 లక్షలు, రజనీకాంత్ 12 లక్షలు, యన్ టి రామారావు 11 లక్షలు బాకీ లున్నారట □






# బోర్న్‌విటాతో పెరిగే ప్రాయం యిది యిక

## వాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే రోజొకటి వస్తుందిక!

1 కి.గ్రా. ప్యాక్‌లో కూడా దొరుకుతుంది. దీని లోపల ఉంది ఉచితంగా లభించే మగ్.

పెరిగే వయస్సులోని పిల్లలు మరే మాల్టెడ్ ఆహార పానీయమూ కాకుండా బోర్న్‌విటాయే ఎందుకు కావాలంటారు? రెండు తరాల్లోని తల్లిదండ్రులు వాళ్ళ పిల్లలకి యిక మరేదీ కుదరదని ఎందుకు పట్టుబడతారు?

కేవలం ఝామ్ అనిపించే రుచి మాత్రమే కాదు. మరి కేవలం బోర్న్‌విటా పేరు చూసీ కాదు. ఉంది అందులో మరేదో. ఉంది యింకా మరెంతో. అదే మరి బోర్న్‌విటా, పెరిగేందుకు తోడ్పడే ఆహార పానీయం.

క్యాడ్‌బరీస్

**బోర్న్‌విటా**

పిల్లలు సరిగ్గా పెరగడం,
అందుకే మరి బోర్న్‌విటా యివ్వడం.






(గత సంచిక తరువాయి)

అనిత ఆరాత్రి క్రింది గదిలో నే పడుకుంది ప్రొద్దున లేచాక గూడా విజయ్ కంట కనబడకుండా తిరుగుతోంది

విజయ్ ఆమెను గమనిస్తూనే వున్నాడు

అనితలో ఎంత మార్పు అనిత అలా వుండడం బాధగా వుందతడికి

భోజనం చేసేందుకు తప్పదన్నట్లు అతడితో కూర్చుంది

విజయ్ తినడం పూర్తి కాగానే ఆమె కెదురుగా మౌనంగా కూర్చోలేక తన గదిలోకి వచ్చి ఆఫీసుకు వెళ్ళే ప్రయత్నంలో పడ్డాడు

అనిత భోజనం చేసి చెయ్యి కడుక్కొని హాల్లోకి వస్తుండగా ఫోన్ మ్రోగింది

అనిత ఫోన్ ఎత్తింది

ఏమిటి అత్తయ్య చనిపోయిందా? అవతల నుండి తండ్రి మాట వినగానే బాధ ఆశ్చర్యం మిళిత స్వరంతో అంది అనిత

ఇప్పుడే వస్తున్నాను అని ఫోన్ పెట్టేసి హడావుడిగా ఇవతలికి వస్తుండగావిజయ్ పైనుండి వచ్చాడు

రమేష్ వాళ్ళమ్మగారు చనిపోయారా? పైకి ఆమె మాటలు వినిపించాయి అడక్కుండా వుండలేక పోయాడు

ఔను అని ఆమె వెళ్ళబోతుంటే ఆగు ఇద్దరం కలిసి వెళ్దాం అన్నాడు

అనిత ఆగి అతడి వైపు చూసింది

మీరు రమేష్ ఇంటికి వస్తారా? ఆ అడగడంలో కోపం వ్యంగ్యం వున్నాయి

అతడు నాకు విరోధికాదు విజయ్ ఇంకా ఏదో అనబోతుంటే మధ్యలో నే అడ్డుపడింది అనిత నిజమే అతడు మీకు విరోధికాదు నా కారణంగా మీరు అతడ్ని ద్వేషిస్తున్నారు అసహ్యించుకుంటున్నారు కాదు అలా నటిస్తున్నారు ఆ నటన నా మనసు అతడి వైపు ఆకర్షిత మవ్వకుండా వుండేందుకు ' అనిత మాట పూర్తయిందో లేదో విజయ్ చెయ్యి ఆమె చెంపను బలంగా తాకింది

ఇలాంటి ఆలోచన్లు వూహలు తప్ప మరో రకంగా ఆలోచించలేని నిన్ను ఏం అనాలో ఏం చెయ్యాలో తెలియడం లేదు నీ మాటలతో నన్ను రాక్షసుడ్ని

జరిగిన కథ-6 : అనితకు ఆ రోజు శుభప్రదమైన రోజు భర్త విజయ్ రాకకై ఎదురు చూస్తున్న అనితకు రమేష్ రాక నిరాశ కలిగించింది ప్రముఖ రచయిత్రి అనితాదేవి అసలు రూపం అంటూ ఎవరో పేపర్లో వేయిస్తే ఆ పని విజయ్ చేసి ఉంటాడని అతడిని నిలదీసి అడుగుతుంది అనిత విజయ్‌కు గతం గుర్తుకు వస్తుంది– అనిత వితంతువని తెలిసినా విజయ్ ఆమెను వివాహం చేసుకొంటాడు అనిత, విజయ్‌ల మేరేజ్‌డేకి వచ్చిన రమేష్ మాటలు అందరికీ చికాకుని కలిగిస్తాయి కాని అతని మాటలేవి అనిత వినలేదు విజయ్ అనితను రమేష్ ఇంటికి వెళ్ళవద్దని అతడి ఇంటికి వెళ్లడం పాముతో స్నేహం చెయ్యటం లాంటిదని చెప్తాడు కాని అనిత అతను తనను, రమేష్‌ను అనుమానిస్తున్నాడని అపోహ పడింది ఇద్దరికి మనస్పర్థలు బయలు దేరాయి.

చేశావు అంటూ అక్కడ నిలవలేని వాడిలా వడివడిగా బైటికి వెళ్ళిపోయాడు

* * * * * *

విజయ్ ఏమిటి ఒక్కడివే వచ్చావు? విజయ్‌ను చూడగానే అడిగాడు ప్రసాదరావు

అనితకు ఈ మధ్య తెలివి తేటలు ఎక్కువయ్యాయి అందుకే నాతో రాలేదు అంటూ రమేష్ దగ్గరికి వచ్చి మీ అమ్మగారికి ఒంట్లో బాగా లేదని చెప్పింది కాని సీరియస్‌గా వుందని అనలేదు అనిత అని అతడ్ని పలకరించాడు

తెలిసినా చేసేదేముంది? నిర్లిప్తంగా అన్నాడు రమేష్

విజయ్ వెళుతుండగా అనిత ఆటో దిగింది విజయ్ చూడనట్లే వెళ్ళిపోయాడు

కూతురు అల్లుడు దేనికో ఘర్షణ పడ్డారని విజయ్ వల్ల తెలుసుకున్నాడు ప్రసాదరావు కాని ఆ సమయంలో అందరిలో కూతుర్ని ఏం అడగలేకపోయాడు

సాయంత్రం అనిత ఇంటికి వెళ్ళి బట్టలు తెచ్చుకొని అక్కడే వుండడం అతడికి నచ్చలేదు

ఇక్కడ అందరు వుండగా నీవు చేసేదేముందమ్మా ఇంటికి వెళ్ళగూడదూ" అన్నాడు

ఎందరున్నా రమేష్‌కు మనమే దగ్గరి వాళ్ళం నాన్నా ఈ నాలుగు రోజులు అతడికి తోడుగా వుంటే అరిగిపోము అంది అనిత

అనితా నా కారణంగా నీవు విజయ్‌తో వివాదపడగూడదు రమేష్ బాధగా అంటే అదేం లేదు అంది అనిత

రమేష్ తన గురించి ఎంత ఆలోచిస్తున్నాడు అతడి మీద గౌరవ భావం కలిగింది

'రమేష్ తనను పెండ్లి చేసుకోలేనని తన అభిప్రాయాన్ని ఖచ్చితంగా చెప్పాడు విజయ్ కీర్తి ప్రతిష్టలకోసం తన మెళ్లో మూడు ముళ్ళు వేశాడు అనుమానం అనే తెర కప్పి ఆ బంధాన్ని త్రుంచేసుకోవాలనుకుంటున్నాడు విజయ్‌ను అనుకుంటే ఆమెకు కోపంగా వుంది అతడు స్వార్థంకోసం తన బ్రతుకును బలితీసుకున్నట్లుగా అనిపిస్తోంది

ప్రసాదరావు కూతురి ప్రవర్తన భయం కలిగిస్తోంటే విజయ్‌తో మాట్లాడాలని వెళ్లాడు గంట క్రిందటే ఫ్లైట్‌లో మద్రాసు వెళ్లాడని చెప్పారు పనివాళ్ళు నిరాశగా వెనుతిరిగాడు

అనితా, ఏం జరిగిందమ్మా? ఎందుకిలా వచ్చావు? కూతురు తనతోపాటు తన ఇంటికి రావడంతో అతడికి కూతురింక అత్తగారింటికి వెళ్లదేమోననిపించింది

విజయ్ ఆరోజు ఎందుకలా అన్నాడు? అనితకీ మధ్య తెలివితేటలు ఎక్కువయ్యాయి అన్న విజయ్ మాటలు చెప్పి అడిగాడు

అతడ్ని అనుమానం పట్టుకుంది రెండో పెండ్లి చేసుకున్న ఆడది అన్నిటికి తెగిస్తుందనుకున్నాడు పెద్ద మనిషిలా కనిపించే అతడిలో అన్నీ కుత్సిత భావాలే మనం తెలుసుకోలేకపోయాము అతడి నీడే భయంకరం అతడు నన్ను పతితురాలివంటూ వదిలించుకోవాలనుకుంటున్నాడు అతడా పని చెయ్యకుండా నేనేవచ్చేశాను

అనితా, ఏమిటమ్మా, అతడేదో కోపంలో చిన్నమాట అంటే దాన్ని పట్టుకొని సంసారమే వద్దను కోడమా?

'భార్యను అనుమానిస్తూ మాట్లాడడం చిన్నమాటా! తండ్రి వైపు అచ్చెరువుగా చూసింది

నేను అలా అనుకోలేదు నాన్నా నన్ను అనుమానించే వ్యక్తితో కలిసి జీవించలేను నాకు కావల్సింది లోకం చూసేందుకు భర్త సంసారంకాదు నన్ను నన్నుగా ప్రేమించే వ్యక్తి విజయ్ చేసుకుంటాననగానే నా కోరిక తీరిందనుకున్నాను కాని అతడు కోరుకున్నది నన్నుకాదు కీర్తిని వెక్కి వెక్కి ఏడుస్తూ అంది అనిత




లేదమ్మా విజయ్ పేరు ప్రతిష్టలు ఆశించేవాడు కాదు. అవే అతడ్ని వరిస్తున్నాయి ఎక్కడో 'ఏదో పొరపాటు జరిగింది విజయ్ రాగానే వెళ్ళి మాట్లాడతాను కూతురి శిరసు మీద చెయ్యివేసి లాలనగా అన్నాడు ప్రసాదరావు

వద్దునాన్నా మీరు అతడి దగ్గరికి వెళ్ళొద్దు మాటలనిపించుకోవద్దు నన్నిలా వుండనివ్వండి దుఃఖాన్ని దిగమ్రింగ ప్రయత్నిస్తూ అంధి

ప్రసాదరావు కూతురి కెలా నచ్చ చెప్పాలో తెలియక అలాగే చూస్తుండి పోయాడు

విజయ్ ఊర్లోలేడని తండ్రి ద్వారా తెలియడంతో ఆ రోజే అతడింటికి వెళ్ళి తన బట్టలు వస్తువులు తెచ్చుకుంది అనిత

నాదంటూ గుర్తు మిగలకుండా తీసుకెళుతున్నాను నేను మీ సుఖానికి సౌఖ్యానికి అడ్డురాను ఇంతకన్నా మీరు మరో పెండ్లి చేసుకొనేందుకు కావల్సినమాట లేమున్నాయి? ఆ మాటలు వ్రాస్తుంటే చెయ్యి వణికింది కాని వ్రాయక తప్పదనుకుంది 'తను విడిపోవాలను కున్నప్పుడు చెయ్యవలసిన మొదటి పని ఇది ' కాగితం మడిచి కవరులో పెట్టి నాయర్ కిచ్చింది అయ్యగారు రాగానే ఇవ్వమని

* * * * * *

విజయ్, అనిత చెప్పింది నిజమేనా? విజయ్ వచ్చాడని తెలిశాక అతడి దగ్గరికి వెళ్ళాడు ప్రసాదరావు

విజయ్ అతడి వైపు అభిమానంగా చూశాడు

మీరు మీ అమ్మాయి చెప్పిందే నిజమనుకొని నన్ను ద్వేషించకుండా మాట్లాడేందుకు వచ్చారు నాకు చాలా సంతోషంగా వుంది ఆనందంతో అతడి కండ్లు చమర్చాయి

# చిన్న నవలలు రాసే వారికి మనవి !

సంపాదకుడు

**భారతి**

**ఆంధ్రపత్రిక కార్యాలయం**

**గాంధీనగరం**

**విజయవాడ - 520 003**

[redacted]

అనిత మీలా నన్ను అర్థం చేసుకోలేదు జీవితంలో చీకటిని నింపింది

ఏమయింది బాబు? అనిత ఎందుకలా అనుకుంటోంది? అన్నాడు ప్రసాదరావు

అనితలో మూర్ఖత్వమే ఆమెనలా అనుకొనేట్లు చేసింది " విజయ్ ఏదో ఆలోచిస్తున్న వాడిలా దూరానెటో చూస్తూ అన్నాడు" మన ఆచారాలు సాంప్రదాయాలు మనకు తెలియకుండానే మనలో జీర్ణమయ్యాయి వీటిలో బ్రతుకు భయంగా మారుస్తున్న కొన్నిటిని కాలానుగుణ్యంగా కాదని ముందడుగు వేస్తున్నారు కొందరు మరి కొంతరు అడుగు ముందుకు వేసినా అంతరాళాలలో వాటిని కాదనలేని బలహీనత వుంటుంది అదెప్పుడో మనసు మీద దెబ్బ తీస్తుంది అనిత విషయంలో అదే జరిగింది మార్పు రావాలంటుంది కాని భయం విడనాడలేదు అనితలో ఆ బలహీనత రమేష్ మాటలతో వెలికి వచ్చింది నేను తనను పెండ్లి చేసుకున్నందుకు బాధపడుతున్నా ననుకుంటోంది తనతో బంధం త్రెంచుకుంటా ననుకుంది కాని రావుగారూ, అనితకు నేనంటే అభిమానం లేకపోలేదు తను విడిపోతూ నేను బాధ పడగూడదని మరో పెండ్లి చేసుకొనేందుకు వీలుగా లెటర్ వ్రాసి పెట్టింది

ఏమిటో బాబూ, దాని తత్వం నాకు అర్థం కావడంలేదు నిన్ను కోరి పెండ్లి చేసుకుంది అర్థంలేని అనుమానాలు పెంచుకుంది విజయ్‌ను చూస్తోంటే అనిత చెప్పిన మాటలు నమ్మలేక పోతున్నాడు ప్రసాదరావు

'విజయ్ అనితను అనుమానించడంలేదని అతడి మాటలే తెలియచేస్తున్నాయి కాని అనితతో ఈ మాట అంటే అతడు నటించాడంటుంది తన మాట వినలేదని బాధపడుతుంది ఎలా? ఏం చెయ్యాలి? విజయ్ అతడి ఆలోచన్ను గ్రహించిన వాడిలా అతడి వైపు చూశాడు

మీరు అనిత గురించి దిగులు పడకండి కొన్నాళ్ళయ్యాక ఆమెకు నిజం బోధపడుతుంది తనకు తానుగా తన ఇంటికి వస్తుంది మనం ఇప్పుడా విషయం గురించి మాట్లాడితే ఆమెకు కోపం పెరగడం తప్ప లాభం వుండదు '

అదీ నిజమే నిట్టూర్చి ఇంటికి బైలుదేరాడు

'అనిత తనకు తానుగా అత్తగారింటికి వెళ్ళడమా ఆ రోజెప్పుడు వస్తుంది? ఎలా వస్తుంది? ఆలోచిస్తున్న అతడు ఆటో వెళ్ళి చెట్టుకు గుద్దుకున్నప్పుడు కాని వాస్తవంలోకి రాలేదు చూస్తుండగానే అతడి తల చెట్టుకు కొట్టుకొని బాగా దెబ్బ తగిలింది ఆ ప్రదేశమంతా రక్తమయ మయింది

వెనకనుండి వేగంగా వస్తున్న లారీ బ్రేకులు పని చెయ్యకపోవడంవల్ల ఆటోకు తగిలి ప్రమాదం జరిగింది

చుట్టూ చేరిన జనంలో డాక్టర్ భార్గవ గూడా వుండడంతో అతడ్ని చూడగానే హాస్పిటల్‌కు తీసుకెళ్లాడు కాని లాభం లేకపోయింది అక్కడికి వెళ్ళిన కొద్ది నిమిషాల్లోనే మరణించాడు ప్రసాదరావు

* * * * * *

తండ్రిపోయాక తన ఇంట్లోనే వున్న అనిత అలాగే వుండి పోతుందనుకున్నాడు విజయ్ కాని పదిహేను రోజులయ్యాక "అనుకోకుండా జరిగిన అవాంతరం నన్ను మీ ఇంట్లో ఇన్నాళ్ళు వుండేట్లు చేసింది ఇక నేను వెళుతున్నాను ' అంటూ ప్రయాణ మయింది

'ఎక్కడికి వెళతావు? ఆశ్చర్యంనుండి తేరుకొని అన్నాడు విజయ్

మీకు చెప్పాల్సిన అవసరం లేదు నాకు కాని చెబుతున్నాను నేను రమేష్ వాళ్ళింటికి వెళ్ళడం లేదు నాకు ఇల్లు వాకిలి వుంది "

"అనితా, మనిషికి ఇల్లు వాకిలే కాదు తోడు నీడ అవసరం " విజయ్ మాటలు పూర్తిగాక ముందే "మీలాంటి తోడు మాత్రం ఎవరికీ ఏ జన్మలో వద్దు" అంటూ వెళ్ళిపోయింది అనిత

'ఆమెలో అనురాగం ఆమెను తననుండి వేరు కానివ్వదని తొందరలోనే అది ఆమె మనసుకు క్రమ్మిన మబ్బులను విడదీసి తన చెంతకు చేరుస్తుందని అనుకున్నాడు కాని అనిత అనుమానం మరింత పెరిగింది రోజు ఆమె పేరు పేపరు కెక్కింది ఆమె గుండెలో తనమీద వున్న అనురాగాన్ని గాలంవేసి లాగింది ఆమె గుండెను గాయం చేసింది ' పేపరు వార్త గుర్తొచ్చేసరికి అతడికి భయం పుట్టింది

"అనిత ఈ షాక్‌కు తట్టుకోలేక ఏ అఘాయిత్యానికో పాల్పడుతుందేమో కుర్చీలోనుండి లేచాడు

"ఆమె వచ్చి అడిగినప్పుడే తనకీ ఆలోచన వచ్చి వుంటే " బైటికి వచ్చి కారెక్కుతూ అనుకున్నాడు

"అసలు పేపరువాళ్ళకెవరు చెప్పారీ వార్త? అతడి మనసు రమేష్‌ను అనుమానిస్తోంది

"అనితకు తనేం చెయ్యకపోగా ఇలా అవమానించాలనుకున్నాడా ఏదైనా ముందు తను అనితకు ధైర్యం చెప్పాలి '

* * * * * *

"అనితా " విజయ్ పిలుపు వినిపించగానే పడుకొని ఏడుస్తున్న అనిత గది గుమ్మం వైపు చూసింది

"ఎందుకొచ్చారిక్కడికి? ఇంకా ఏం చెయ్యాలనుకుంటున్నారు?"

అనితా నీకెలా చెబితే నేను అర్థమవుతాను? బాధగా అన్నాడు విజయ్

నీకు అవమానం జరిగితే నాకు జరిగినట్లు కాదా? నేనే నిన్ను అవమానిస్తానని ఎలా అనుకున్నావు? నీ బాధ చూడలేను అనిత నాతో రా ఆ పేపరు వార్త తప్పని లోకానికి సూటిగా చెపినట్లవుతుంది అంటూ విజయ్ లో పలికి వెళ్లాడు

అయితే ఈ విదంగా నన్ను తలవంచేట్లు చెయ్యాలనుకున్నారన్న మాట ఏదో అర్థమైనదానిలా అంది అనిత

అనితా

'మీ మాటలకు చేతలకు లొంగేదాన్ని కాదు వెళ్లండి నామీద ప్రేమ వున్నట్లు నటించి నాకింకా కోపం తెప్పించకండి దోసిట్లో ముఖం దాచుకొని ఏడుస్తోంది

అనితా విజయ్ ఆమె మాటలు లెక్కపెట్టకుండా ఆమె దగ్గరికి వచ్చాడు

చెప్పు అనితా నా ముఖంలోకి చూసి చెప్పు నేను నటిస్తున్నానా? ముఖానికి అడ్డుగా వున్న ఆమె చేతులను తొలగించబోతే ఆమె ప్రక్కకు జరిగింది

నేనిప్పుడు కొత్తగా మిమ్మల్ని చూసి చెపాల్సినదేమీ లేదు మీరు నిజంగానే నన్ను ప్రేమించినట్లయితే నా జీవితం ఇలా వుండేదికాదు

అనితా నీవెందుకింకా అలాగే ఆలోచిస్తున్నావు? నేను ప్రేమించడం అబద్ధమే అయితే నాకెందుకీ బాద?

మీ బాద లోకం చూసేందుకు

అనితా స్తబ్ధుడయ్యాడు విజయ్

నీవు నీవు నేను ప్రేమించిన అనితవేనా? బాధ ఆశ్చర్యం కలిసిన స్వరంతో అన్నాడు

'నేను ప్రేమించిన అనిత అనురాగమూర్తి

అనిత జీవంలేని నవ్వు నవ్వింది

మీ అనుమానంతో ఆ అనురాగమూర్తి గుండెలో మంట పెట్టారు దానితో ఆమె దహించుకుపోయింది ఇప్పుడున్నది జీవచ్ఛవం

అనితా బాధగా అన్నాడు

నీవలా మాట్లాడితే నేను భరించలేను నీవు నన్నేం అనుకున్నా ఫరవాలేదు లోకం నిన్ను నిందించకుండా వుండేందుకు నాతో రా

లోకానికి భయపడి అవమానాలను దిగమ్రింగుతూ నరక జీవితం గడుపుతాననుకున్నారా? అతడి వైపు చూసింది

నేను తప్పు చెయ్యలేదు నేనెవ్వరికీ భయపడాల్సిన అవసరం లేదు అలాంటి అవసరం ఏదైనావున్నా మీ దగ్గరికి రాను

అనితా రమేష్ మాటలు విని మన జీవితాలను దగ్ధం చేస్తున్నావు ఇకనైనా మేలుకో

'విజయ్ ' అనిత స్వరం కటువుగా పలికింది

రమేష్ పేరు ఎత్తేందుకుకూడా మీకు అర్హతలేదు వెళ్లండి ఇంకా ఇక్కడే వుండి మాటలతో నన్ను రెచ్చగొట్టకండి మీ మాటలకింక నేను మోసపోను ఆ మాటలు విన్నాక విజయ్ అక్కడ వుండలేకపోయాడు

అనిత తననిక అర్థం చేసుకోలేదు నిస్పృహగా బైటికి వచ్చి ఇంటికి వెళుతూండగా సగం దూరంలో ఆలోచన వచ్చింది తనిన్నాళ్లు రమేష్ గురించి తెలిసినా ఒక్క మాటగూడా అడగలేదు ఇప్పుడు గూడా మవునంగా వుంటే అతడింకా ఏంచేస్తాడో కారు హాస్పిటల్ వైపు తిప్పాడు

రమేష్‌తోనే అనితకు నిజం చెప్పించాలి అతడ్ని ఏ వేవో అడగాలని వెళ్ళాడు కాని రమేష్ ఆపరేషన్ థియేటర్లో వున్నాడని చెప్పారు అక్కడున్న నర్సులు అతడి కారోజు మూడు నాలుగు ఆపరేషన్లు వున్నాయట

అవి పూర్తయ్యే వరకు తను అక్కడున్నా రమేష్‌తో మాట్లాడే అవకాశం వుంటుందో లేదోనని ఇంటికి వచ్చాడు విజయ్ అతడికి ఆఫీసుకు వెళ్ళాలనిపించలేదు గుండెనిండా బాద నిండి వుంటే అతడు ఆఫీసుకు వెళ్ళినా లాభమేముంది?

** ** **

విజయ్ గదిలోకి వస్తూ అన్నాడు సుదాకర్ అతడితో పాటు భార్గవ కూడా వచ్చాడు

నీ కోసం ఆఫీసుకు వెళ్ళాము నీవు రాలేదంటే ఇలా వచ్చాము సుదాకర్ అతడి కెదురుగా కుర్చీ జరుపుకొని కూర్చుంటూ అన్నాడు

భార్గవ విజయ్ ప్రక్కన మంచం మీదే కూర్చున్నాడు

'ఏమిటి రోజు ఆఫీసుకు వెళ్ళలేదు? ఒంట్లో బాగ లేదా? భార్గవ అతడి నుదుటి మీద చెయ్యి వేస్తూ అన్నాడు

విజయ్ పేలవంగా నవ్వి అతడి చెయ్యి తీసేస్తూ ఒంట్లోకేంరా బాగానే వుంది మనసే బాగో లేదు దానికి మందు ఇస్తారా? అన్నాడు

ఎందుకురా అలా అంటావు?

నా బాద మీకు తెలియదురా ఈ రోజు పేపరు చూశారా?

అది చూసే నీతో మాట్లాడాలని వచ్చాము

అనితాదేవి ఇలా చేస్తుందని మేము అనుకోలేదు ఆమె కోసం నువ్వెందుకు బాద పడాలి సుదాకర్ ఆవేశంగా అంటుంటే సుదా మెల్లగా అన్నాడు విజయ్

అనిత మనసు మీకు తెలియదు ఆమె హృదయంలో నాకు తప్ప మరెవ్వరికీ చోటు లేదు

మరి పేపరు వార్త...






# నేను కోరుకొనే మతం

మతం మతం అని
ఇన్ని అరుపులు అనవసరం,
మనిషికి తిండి, గుడ్డ, గూడు
ఇవ్వలేని మతం నాకొద్దు,
మతం పేరుతో
మనిషికి మనిషికి
దూరాలను కల్పిస్తూ
మనుష్యుల మధ్య
వైషమ్యాలను పెంచే
మానవత్వం లేని
పెద్ద మనుషుల
ఉన్మాద ప్రేలాపనలు,
పోసుకబుర్లు,
పనికిరాని ఆర్భాటాలు
నాకు అక్కరలేదు,
మనిషికి కనీస అవసరాలను
ఇవ్వగలిగే మతమే
నాకు కావాలి,
తోటి మనిషిని
మానవత్వంతో చూడగలిగే
స్వభావాన్ని ప్రేరేపించగలిగే
మతమే నేను కోరుకొనేది.

—కో. వేంకట పాపారావు

## పసిడి బొమ్మ

అది మీరు నమ్ముతున్నారా?" భార్గవ సుధాకర్‌ల వైపు చూసి అన్నాడు విజయ్

"ఏం నీవు నమ్మటం లేదా? అనితాదేవి, రమేష్ సన్నిహితంగా వుంటున్నారు" అన్నాడు సుధాకర్

"వాళ్ళలా వున్నారని మనం అనుమానించగూడదు. అతడు అనితకు బంధువు. అనితకా వుద్దేశ్యం వుంటే పేపరు చూడగానే బాధ పడుతూ నా దగ్గరికి రాదు."

"అనితాదేవి నీ దగ్గరికి వచ్చిందా?" ఆశ్చర్యంగా అన్నాడు భార్గవ

"వచ్చింది అయితే ఇక్కడ వుండేందుకు కాదు. ఆ పేపరు వార్త నేనే వ్రాయించానన్న అనుమానంతో వచ్చింది. తన బాధను వెళ్ళగక్కుతూ నా గుండెనూ మరింత గాయం చేసి వెళ్ళింది." విజయ్ తను ఆమె దగ్గరికి వెళ్ళడం అక్కడి నుండి రమేష్‌తో మాట్లాడేందుకు వెళ్ళిన విషయం గూడా చెప్పాడు.

"రమేష్ కనిపించి వుంటే ఆ ఆవేశంలో ఏం చేసే వాడినో.

"రమేష్ వ్రాయించి వుంటాడనిపించడం లేదు నాకు." సాలోచనగా అన్నాడు సుధాకర్

"అతడే వ్రాయించి వుంటే అమెరికాలో వుండి వచ్చిన వాడని వ్రాయించడు. తను అనితతో తిరగడం చూసిన వాళ్ళు తనే అతడని అనుకుంటారని తెలియని వాడు కాడు. తనంత తానుగా తన పేరు బైట పెట్టుకోరెవరూ..."

"మరి అనిత గురించి లోతుగా తెలిసిన వాళ్ళెవరున్నారు?" అన్నాడు విజయ్

"అనితాదేవి మామూలు మనిషి కాదు. సంఘంలో పేరున్న వ్యక్తి. ఆమె నడతలో శ్రద్ధగా పరిశీలిస్తుంటారు. పేపరు వాళ్ళ నడిగితే పేరు తెలుస్తుంది."

"వద్దు సుధా ఆ పని మాత్రం చెయ్యొద్దు రేపు మనం అడిగినట్లే కాకుండా వాళ్ళు ఆమె గురించి గూడా ఇంకేవో రాతలు వ్రాస్తారు వాళ్ళకా అవకాశం ఇవ్వగూడదు.

"నిజమే ఆమె గురించి రేపు మనమే వ్రాయించినట్లవుతుంది కాని ఈరోజు ఈ వార్త చూసిన ఆమె అభిమానులు, ద్వేషించే వారు గూడా ఆమె నెన్నో ప్రశ్నలు వేస్తారు."

విజయ్ దిగులుగా చూశాడు

"నేనలా అనుకునే అనితను నా దగ్గరికి రమ్మన్నాను ఆమె ఇక్కడికి వస్తే లోకం ఆమెనేమి అనలేదు కాని అనిత నేనీ మాట అనేందుకే పేపరులో ఆ వార్త వ్రాయించానన్నది."

"ఇక నువ్వు ఆమెకోసం బాధపడడం ఎందుకు?" కోపంగా అన్నాడు సుధాకర్.

"కాని సుధా, అనిత ఈ రోజు మ్యారేజ్ డే అని మరచిపోలేదు. శ్రద్ధతో జరుపుకోవాలనుకుందని ఆమెను చూసి తెలుసుకున్నాను ఈ రోజే ఇలాంటి వార్త రావడం. అనిత ఎంత బాధపడుతుందో." వ్యథాపూరిత స్వరంతో అన్నాడు విజయ్.

"ఆ బాధ నువ్వు కలిగించింది కాదు" అన్నాడు సుధాకర్.

"కాని అనితను నేను ప్రేమించాను ప్రేమిస్తున్నాను ఆమె నా భార్య ఆమె బాధ నేను చూడలేను."

"చెయ్యగలిగేదేమీ లేనప్పుడు విచారించి లాభమేమిటి?"

"విచారించడం కాదు ఆమె కేదైనా చెయ్యగలనేమోనని ఆలోచిస్తున్నాను"

అనిత అతడ్ని అనుమానిస్తూ మాట్లాడినా అతడు బాధ పడడం లేదు. ఆమెమీద అనురాగం అతడ్ని ఆ విషయం గురించి ఆలోచించ నివ్వడం లేదు

'అనిత బాధనెలా మరిపించడం?' అదే అతడి ఆలోచన.

అతడు ఇంతటితోనైనా అనితను మరిచి జీవితం మలుపు తిప్పుకుంటాడనుకున్న సుధాకర్ భార్గవలకు అతడ్ని చూశాక అది అప్పుడే జరగదనిపించింది.

'అనితకు అతడి మంచితనం అలుసిచ్చింది. ఇద్దరు ఎవరికి వారే మనసులో అనుకున్నారు.

"ధనవంతుడు గుణవంతుడు అయిన విజయ్ జీవితం వడ్డించిన విస్తరి అనుకున్నాను. కాని అతడి జీవితంలో అంతులేని విచారం... విజయ్‌ను చూస్తుంటే పెండ్లంటే భయంగా వుంది." హాస్పిటల్‌కు వెళుతూ త్రోవలో అన్నాడు భార్గవ.

**"అందరూ అనితలు, రమేష్‌లే కారు" అన్నాడు సుధాకర్.**

**"స్త్రీలు తమకేదో అన్యాయం జరుగుతోందని అంటుంటారు. సహృదయంతో ఆదరించిన వారిని అర్థం చేసుకోరే?" భార్గవకు స్త్రీలంటేనే కోపం వచ్చిందా సమయంలో**

**"అర్థం చేసుకోవాలంటే హృదయ విశాలత పెరగాలి. తమ జీవితం వెలుగులోకి పయనించేలా చేసుకోడం తప్పుకాదని మనస్ఫూర్తిగా అనుకోవాలి. అనితాదేవి అలా అనుకోలేదు. తను మళ్ళీ పెండ్లి చేసుకోడం తప్పనుకుంది. దానితో అనుమానాలు....." అన్నాడు సుధాకర్.**

**(ఇంకా ఉంది)**

# సరికొత్త సొగసైన రూపంలో పియర్స్!

Pears®
The original glycerine soap.

ఇప్పుడు పియర్స్ సొగసులొలికే సరికొత్త
ప్యాక్‌లో వస్తోంది. శుద్ధమైన, సౌమ్యమైన సబ్బుని
తెలిపే రూపంలో. పియర్స్—అసలు సిసలైన గ్లిసరిన్ సబ్బు.
దీనిని మార్చాలని మీరూ అనుకోరు.
అలాగే మేమూను.

**పియర్స్ మీ చర్మాన్ని యవ్వనంగా,**
**సుకుమారంగా ఉంచుతుంది.**

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.




LINTAS PS 62 2720 TL

# వెదురు పడవలు

**-భాగవతుల సుబ్రహ్మణ్యం**

గాంధీ హాస్పటల్ మెయిన్ గేటు దగ్గర ...

రెండు యాపిల్ పళ్ల బళ్లూ, ఓ రొట్టి-బిస్కట్ల బండీకి మధ్యన.

మురికి ఫుట్‌పాత్ మీద మూరెడంత జాగాలో

మఠం వేసుక్కూర్చున్న మూడు బక్క ఆకారాలు

ఆ పిసరంత జాగాలోనే ఒక ప్రక్క సైజుగా కోసిన కొన్ని వెదురు బొంగులు మరో వైపు సగం వరకు చీరినవీ, పల్చని బద్దలుగా కోసినవీ, విలువంపుగా మడచి పెట్టినవీ వివిధ రకాల్లో వున్నాయ్ కఱ్ఱ పదార్థాన్ని అతికే ఫెవికాల్ ఎడ్‌హెసివ్ బైండర్ మూత తీసి పెట్టిన రబ్బరు టంబ్లర్‌లో వుంది. ఇంకా అలంకరణకు పనికొచ్చే, రకరకాల డెకొలామ్ ముక్కలు చిన్న గుట్టగా పోగు చేయబడి వున్నాయ్.

మూడు బక్క ఆకారాల్లో ఒకటి బాగా తల పండినది రెండోది మధ్య వయసు మూడో శాల్తీ ఇంకా టీనేజ్‌లోనే వుంది

ఆ ముగ్గురూ ఒక కుటుంబంలోని వాళ్ళు కారు ఒక ప్రాంతం వాళ్ళు కారు. ఒక మతం కాని, ఒక కులంగాని అసలేకాదు. అయినా వాళ్ల మధ్య సఖ్యత వీటన్నిటికీ అతీతం.

ఒక కుటుంబంలో వ్యక్తులు కూడా అంత సన్నిహితంగా వుండకపోవచ్చు. కాని వీళ్ల మధ్య ఏ పొరపొచ్చాలు లేవు.

ఒకే ప్రాంతం మనుషులైనా అంత ఆత్మీయత ప్రదర్శించలేకపోవచ్చు. కాని వీళ్లకు ఆ బేధ భావం లేదు

ఒక మతం కాకపోవచ్చు దాన్ని మించిన మమత, మానవత వాళ్ల ఆరో ఊపిరి

బాగా తల పండిన అతడు పీటరు రెండో వాడు స్వాములు కుర్రాడు రణసింగ్.

ప్రస్తుతం ముగ్గురూ కలిసి ఒకే కళాత్మకమైన పనిలో నిమగ్నమై వున్నారు జానెడు పొట్ట కోసం పడే తిప్పల్లో, వాళ్లదో రకం వృత్తి.

భుక్తి కోసం, చేతికొచ్చిన పనిలో నైపుణ్యం చూపించి, నాలుగు రాళ్ళు వెనకేసుకోలేకపోయినా, నాలుగు వెళ్ళు నోట్లోకెళితే అదే చాలుననుకొనే అల్ప సంతోషులు వాళ్ళు

మార్వాడీ మేడల్లో, ఆరేడు అంతస్తుల భవంతుల్లో, విలాసాల నిలయాలైన ఎ.సి. రూముల్లో, వార్డ్‌రోబ్‌లనూ, కప్‌బోర్డులనూ అతి సుతారంగా అలంకరించే కళా నైపుణ్యం వాళ్లది

వాళ్ళు చేసేవి వెదురు పడవలు

చిల్లు పడవల్లా బతుకుల్నీడుస్తున్నా, మేడల గూడులలో, ప్రకృతి సౌందర్యాన్ని నింపడానికి శ్రమిస్తారు వారు

ఎక్కడో అడవుల్లో ఏపుగా పెరిగిన వెదురు బొంగుల్ని, అష్ట కష్టాలూ పడి నరుక్కొచ్చి, వాటిని సైజులవారీగా కోసి, కావలసిన రీతిలో బొమ్మ పడవ తయారీకి పనికొచ్చే నమూనాలకు అనుగుణంగా చెక్కి, వాటికి కళాత్మక విలువల సంతరించి పెట్టి, తుది మెరుగులు దిద్ది, అమ్మకానికి పెడితే, కారు బాబులు కారు చౌకగా బేరమాడటానికి దిగి రాగా, "ఈలోకపు తీరే అంత! ఇదే షోకేస్‌లో అద్దాల మధ్య బంధించబడితే అరవంద అన్చెప్పినా, పర్సులోంచి నోట్లు పరిగెత్తుకుంటూ వస్తాయి ఫుట్‌పాత్ మీద పెట్టగానే, అణాకానీ సరుకుగా చెలామణీ కావలసి వస్తోంది" అని సరి పెట్టుకుని ఎంత గిట్టుబాటు అయితే అంతే కానిమ్మని నిర్లిప్తంగా నెట్టుకొచ్చేస్తున్న నిరాశా స్వభావం వాళ్లది

బ్యాంకులో ఎక్కౌంట్లు లేవన్న బాధ వారికి లేదు.

రేపెలా గడుస్తుందన్న చింత అసలే లేదు

ప్రకృతి శక్తుల వైపరీత్యాలు ఎండా- వానా- చలీ వంటి వాటినీ వాళ్ళు ఖాతరు చెయ్యరు

గూడు- కూడు-, కూడబెట్టడానికి డబ్బూ, సుఖ పెట్టడానికి తోడూ- ఇవీ వారికి తృణప్రాయమే

ఏదో- బతకాలి కాబట్టి ఇలా. రోడ్డున పడి జీవితాన్ని ఈడ్చేస్తున్నాం. ఇంతే అనుకుంటారు వాళ్ళు.

వాళ్లకెప్పుడూ చేతి నిండా పనే అయినా నిత్యం పస్తులే.

రోజుకు నాలుగు వెదురు పడవలు అమ్మితేనే గాని, ముగ్గురూ రెండు పూటలా భోజనం చెయ్యలేరు మరో పడవ అమ్మితేనే వాళ్ల చాయ్- బీడీ- పాన్ ఖర్చులు వెళ్లాలి

ముగ్గురూ సూర్యుడితో పాటు మేల్కొంటే, పొద్దు పోయేసరికి తుది మెరుగులతో సహా పది పడవలకు స్వరూపం ఇవ్వగలరు.

ఒక్కో పడవ. వచ్చే మనిషినిబట్టి రకరకాల విలువలు పలుకుతుంది. సగటున రోజుకు ముప్ఫయ్ రూపాయలు రావాలి వాళ్ళు బతకడానికి

ఫెవికాల్ కొనడానికి, ఇతర ముడి పదార్థాలకూ రోజుకు ఇరవై రూపాయల దాకా ఖర్చు వుటుంది.

అంటే రోజుకు యాభై సంపాదిస్తేనే వాళ్ల బ్రతుకు వెళ్లమారుతుంది లేకుంటే మరో రోజు తెల్లవారుతుంది

"సింగూ! మూత తీసేసేవ్ అది గట్టి పడిపోద్దని నీకు తెల్దేటి?" ఎడ్‌హెసిప్ జార్‌కేసి చూపిస్తూ అన్నాడు స్వాములు

"అది కాదు సోములన్నా! పీటరు తాత పడవకి ప్రక్క రేకులు అంటించమంటేనూ- ఇప్పుడే తీశాను ఇదుగో మరో రెండు రెక్కలు అంటిస్తే సరి పోతుంది" అంటూ పల్చని వెదురు బద్దలు అందుకున్నాడు సింగు

పీటరు తాత బీడీ దమ్ము గట్టిగా పీలుస్తూ "ఒరే సాములూ! నువ్వు మారికెటుకాడికెల్లి, నిన్న మిగిల్న రెండూ సొమ్ము జేసుకునిరా! నేపోతే, మద్దాన్నం టీనీల్లకు్కూడనేవు. మనం సే సే కాడికే వొచ్చి కొనాలంటే, ఎందరొత్తారు? నువ్వా పని సూడు. సిన్నోడు నేనూ ఈ లోపున సాదాగా మర్నాలుగ నాగేత్తాం ఏటి.... ఇనిపిస్తుందా! నెగు" నెదురు బొంగు చెక్కుతున్న సాముల్ని లేవదీస్తూ అన్నాడు.

"సర్లే! అదేదో నువ్వే సూడరాదూ! ముసిలోడివి. పన్లో నువు కూకుంటే ఇంత పెద్ద వొయిసులో ఎన్ని సేయ్యగలవు సెప్పు ఈడూ- నేనూ అవితే, నువ్వొచ్చే నోపున ఆరుదాకా సేసీత్తాం అందికని ఆ పనేదో నువ్వే సేసుకో" అక్కడ్నుంచి లేవకుండానే అన్నాడు స్వాములు జవాబుగా.

పీటరు తాత రెండు పడవల్ని జాగ్రత్తగా చేతుల్లోకి తీసుకుని అల్ఫా హొటల్ వైపు నడక సాగించాడు

*   *   *

పది గంటలు కాకుండానే పెళ పెళలాడిపోతోంది వేసవి ఎండ

పీటరు తాత, ఆల్ఫా హొటల్ దాటి, రెజిమెంటల్ బజారు దాటి, కౌన్ హైస్కూలుదాకా నిదానంగా నడుచుకుంటూ వెళ్లాడు. దార్లో ఒకరిద్దరు బేరం చేశారు గాని, పొంతన లేని మాటల వల్ల అవి కొనే రకాలు కాదని, తన ఇన్నేళ్ల అనుభవంలోనూ ఇట్టే గ్రహించేశాడు పీటర్.

సంగీత్ థియేటర్ దగ్గర .

పీటర్ వాలకం చూడగానే, 'ఇది ఫుట్‌పాత్ కాటగిరీ' అని పసిగట్టేశాడో ఎర్రటోపీ

మామూళ్ల వేటలో పీటర్‌తో బోణీ కొట్టాలనుకున్నాడో ఏమో రెండడుగుల్లో అతడ్ని సమీపించాడు.

"ఆగరా బాడుఖావ్! గట్ల పోతావ్... నిలూ బే.!"

పీటర్ వయసులో మూడో వంతు వుంటుందేమో ఆ పోలీసుకి పెద్దవాడన్న కనీస మర్యాదైనా లేకుండా మాట్లాడ్డం. . (అలా అనడానికి వీల్లేదు కాబోలు) గద్దించడం ప్రారంభించాడు.

నిజానికి వాళ్ల సంభాషణ ఇక్కడ యథాతథంగా రాయాలంటే, పోలీసు డైలాగ్స్ మీద సెన్సారింగ్ చేయక తప్పదు బండ బూతులు, వాటితో పాటు రెండు మూడు లాఠీ దెబ్బలూ, ఆ బక్క ప్రాణి మీద తన ప్రతాపాన్ని చూపించడానికి అతడు చేసిన ప్రయత్నాలూ వెరశి చివరగా జరిగిన సంగతేమిటంటే -రోజు కష్టం కొన్ని క్షణాల్లో నిర్దాక్షిణ్యంగా, పైసా వెచ్చించనక్కర్లేకుండా పోలీసు హస్తగతమై పోయాయి. పైగా పీటర్ ఒళ్లు లాఠీ దెబ్బలతో హూనమైపోయింది. దాని క్కారణ మేమిటంటే పోలీసు మామూలు ఇయ్యకపోవడమట, అనవసరంగా అతడ్ని బతిమాలి వాదన పెంచుకోవడమట

పైన పేల్చేస్తున్న ఎండ జాయింట్లూ- కీళ్లూ కలుక్కుమనేలాగ పోలీసు దెబ్బలు కడుపులో కాలుతున్న ఆకలి. . వీటన్నిట్నీ మించి వయో భారం .. పీటర్‌ని అడుగు ముందుకు వేయనివ్వ లేదు. శోషొచ్చి అక్కడే స్పృహ తప్పి పడిపోయాడు.

అంతటి ఘనకార్యం చేసిన సదరు పోలీసు కళాత్మకంగా చేతిలో ధగధగా మెరిసిపోతూన్న వెదురు పడవల్ని సవిలాసంగా పట్టుకుని నడక సాగిస్తున్నాడు బెదిరించి తన్ని అవి లాక్కున్నాడే కాని, వాటిని ఇంట్లో పెట్టుకోడానికి కాదు వీధిలోంచి గదిలోకికూడా రాకుండానే ఏ కీలుకాకీలు ఊడలాగి పోగలు పెట్టగల రాక్షస పిల్లలు ముగ్గురున్నా రతడికి. అంచేత వాటి నెలాగైనా 'కాష్' చేసుకోవాలని అతడి ప్రయత్నం.

బాగా ఆలోచించిన మీదట ఓ హాండిక్రాఫ్ట్స్ ఎంపోరియం వాళ్ళు ఇటువంటివి కొనుగోలు చేసి, అమ్ముతారని అతడు ఊహించాడు. ఆ ప్రకారమే ఆ రెండిటినీ వాళ్లకు ముప్ఫయ్ రూపాయలకు అమ్మేశాడు కూడా

ఆ రోజు సదరు పోలీసుగారి సతీమణి పుట్టిన రోజు. ఏదో- ఇంట్లో ఓ చిన్న సైజు పార్టీ ఏర్పాటు చేసిందామె. ఆ వేడుకలు కాస్తా అయిపోయాక సాయంత్రం భర్తతో కలిసి సిన్మాకెళ్లాలని ప్రపోజ్ చేసిందావిడ. అందుకే ఇతడు ఉదయాన్నే మామూళ్ల వేటలో పడ్డాడన్న మాట పిక్చర్ ప్రోగ్రాంకి తగినన్ని డబ్బు ఒక్కసారే చేతిలో పడగానే ఆనందంగా ఇంటి ముఖం పట్టాడు- దార్లో ఓ అర్థ కిలో స్వీట్సు కొనుక్కుని.

వదిన గారి పుట్టిన రోజు అని తెలిసి, ఆ-రోజు మధ్యాహ్నం పార్టీ టైమ్‌కి పోలీసుగారి తమ్ముడు ప్రజంటేషన్‌తో సహా దిగబడ్డాడు

మరిది తెచ్చిన ప్యాకెట్‌లో ఏముందో అని ఆత్రంగా విప్పి చూసింది వదినగారు.



తీరా చూస్తే- అది వెదురు పడవ.

చక్కని నగిషీ పనితనంతో, దివ్యంగా వెలిగి పోతోంది.

ఆమె మహదానందపడిపోయింది. తనకు నచ్చిన ప్రజంటేషన్ తెచ్చినందుకు ఆమె మరిదిని తెగ మెచ్చుకుంది కూడా. అసలా వెదురు పడవల్ని ఆమె మార్కెట్‌కు వెళ్లినపుడే చూసిందట కాని షోకేస్ లోంచి తీస్తేనే అది అపురూపం అన్నంత ధర చెప్పాడట షాపు వాడు అప్పటికి ఏదో సర్దుకుని వూరుకున్నా ఆమె మోజు అలాగే వుందట. ఇప్పుడీ విధంగా తాను కోరుకున్నది లభ్యమైందని ఒకటే సంతోషం

ఆవిడ అందరికీ దాన్ని చూపించి మహా ముచ్చట పడింది డ్యూటీ నుంచి రాగానే భర్తకూ దాన్ని చూపించింది



దాన్ని చూడగానే అతడు 'షాక్' కొట్టినట్టు అయ్యాడు. భార్యకెంతో ప్రియమైనది, తన చేతికి సునాయాసంగా దొరికి కూడా, దాన్ని చేజేతులా జార విడచుకున్నందుకూ, ఆమెకు అంత ఆనందాని ప్రజెంట్ చేసిన క్రెడిట్ తనకు దక్కనందుకూ విపరీతంగా నొచ్చుకున్నాడు.

తర్వాత తమ్ముడిని చాటుకు పిలిచి "ఏరా! ఆ ప్రజంటేషన్ కోసం ఎంత తగలేశావ్?" అని నిలేశాడు.

"బాగుందన్నయ్యా! అది నేను కొన్నానా ఏంవ న్నానా! గాంధీ హాస్పటల్ దగ్గర ఓ ఇద్దరు అణా కానీ వెధవలు ప్లాట్‌ఫాం మీద అమ్మకానికి పెడితే, మన మామూళ్లు ఇవ్వడానికి డబ్బుల్లేకపోతే, నాలుగు వడ్డించి లాక్కున్నానంతే" అంటూ అసలు విషయం అన్నకు చెప్పేశాడు అతడు. అవునూ.... అతడూ పోలీసే మరి

*　*　*

అయితే-

వాళ్ల పైశాచిక ఆనందానికి బలైపోయిన ఆ మూడు అర్భక జీవాలూ ఒకే రోజున తగిలిన 'ఆర్థిక షాక్' వల్ల ముడి పదార్థాలు కొనడానిక్కూడా డబ్బుల్లేక మాడిపోయేరని మాత్రం వాళ్లకి తెలీదు. అంతే! □



విమల్ సూటింగ్స్ ఈ వేసవికై ప్రత్యేక సూటింగ్ శ్రేణిని సగర్వంగా సమర్పిస్తుంది. వీటితో మీరు ఎన్నో సరిక్రొత్త ఫేషన్ ప్రయోగాలు చేయవచ్చు.

ఎ) పార్టీలకై ప్రత్యేకం: సమ్మర్ టక్సేడో.
బి) ప్రత్యేకమైన సందర్భాలకోసం జోధ్‌పూరి.
సి) ఎటువంటి సందర్భంకోసమైన సరే, హాయిని, అందానిచ్చే కూర్తా-చురిదార్.
డి) ఇహ షెర్‌వాణి అంటారా, ధరించి చూడండి. మీకు సరిక్రొత్త రూపురేఖల్ని అందిస్తుంది.

ఈ పలురకాల ఫేషన్లకై విమల్ పాలిరిచ్ సూటింగ్స్‌లో ఈ వేసవికై మీకు అద్భుతమైన శ్రేణి లభిస్తుంది.

**పాలిరిచ్ సూటింగ్స్**







D

ఎక్సిక్యూటివ్ ఎక్సలెన్స్‌లో ఫేషన్ సీన్ సమ్మర్ '85 బుక్‌లెట్ కోసం ఈ కూపన్‌ని పంపండి:
ఎడ్వర్‌టైజింగ్ డిపార్ట్‌మెంట్, రిలయన్స్ టెక్స్‌టైల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ నరోడా, అహమ్మదాబాద్ 382 330.

Mudra-B-RTI-2241 TEL



కమలహాసన్, అంబిక, కిలాడి లో



# సినిమా విశేషాలు

-జి.వి.జి.

## కమలహాసన్, మాధవి, అంబికలతో జయచిత్ర వారి "కిలాడి"

ఇళయరాజా సంగీతం బొంబాయిలో ప్రసిద్ధి పొందిన పప్పు వర్మ సమకూర్చిన ఫైట్స్ గల రొమాంటిక్ సబ్జెక్ట్ బొంబాయిలో 10 రోజులపాటు కార్ ఛేసింగ్ సీన్స్‌ను చాలా థ్రిల్లింగ్‌గా కెమెరామన్ రంగా షూట్ చేశారు ఒక సాంగ్‌కోసం రెండు ఫుల్ ఫ్లోర్స్‌లో రెండు లక్షల వ్యయంతో తోట హేమచందర్ రూపొందించిన సెట్ మరో ఆకర్షణ కొన్ని కీలక సన్నివేశాలను సాంగ్స్‌ను ఊటీలో కూడా షూట్ చేశారు " అన్నారు ఏడిద విశ్వమోహన్ ఈయనా ఏడిద శ్రీరాం ఏడిద రాజా నిర్మించిన జయచిత్రవారి "కిలాడి" చిత్రం మార్చిలో విడుదలవుతుంది కమలహాసన్. మాధవి అంబిక సత్యరాజ్ ప్రభృతులు నటించారు రాజశ్రీ మాటలు, పాటలు రాశారు కృష్ణ సంకలనకర్త "పున్నమినాగు కొండవీటి నాగులు, గంగ్వా (హిందీ)" చిత్రాలతో ఖ్యాతి పొందిన రాజశేఖర్ ప్రతిభకు మరో తార్కాణం కిలాడి "

## గిరిబాబు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో "రణరంగం" సినిమాస్కోప్ చిత్రం

"ఆక్షన్‌తో పాటు సెంటిమెంట్ కలగలసిన చిత్రం. జనవరి 19 నుంచి 21 వరకు మద్రాసులో, జనవరి 25 నుంచి ఫిబ్రవరి 5 వరకు బెంగుళూరులో, ఫిబ్రవరి 12 నుంచి 28 వరకు కేరళలో – ఇలా తమిళ, కర్నాటక, కేరళ రాష్ట్రాలలో షూట్ చేశాం." అన్నారు గిరిబాబు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కోగంటి కేశవరావు నిర్మించే శ్రీ భ్రమరాంబికా ఫిలిమ్స్



అనూరాధ, "బెబ్బులి వేట లో

"రణరంగం" సినిమాస్కోప్ చిత్రంలో భానుచందర్ గిరిబాబు, సత్యనారాయణ రమణమూర్తి త్యాగరాజు, ఆనందమోహన్, కొంగర జగ్గారావు చలపతిరావు, రామదాసు సిలోన్ మనోహర్ సుమలత, జయమాలిని, సిల్క్‌స్మిత నిర్మల వగైరా తారాగణం. అప్పలాచార్య మాటలు గోపి పాటలు రాశారు. చక్రవర్తి సంగీతం విజయ్ ఛాయ, రంగారావు శిల్పం. వీరప్ప కూర్పు చంద్రశేఖర్ ప్రొడక్షన్ అప్పారావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు పతాక సన్నివేశాలు మార్చిలో చిత్రీకరింపబడతాయని గిరిబాబు దర్శకత్వంలోనే అక్టోబర్ నుంచి హాంకాంగ్‌లో చిత్రీకరణ జరిగే జేమ్స్‌బాండ్ తరహా చిత్రంలో గిరిబాబుతో పాటు భానుచందర్ నటిస్తారని నిర్మాత తెలిపారు

అందరికంటే మొనగాడు లో రాజ్యలక్ష్మి, జయసుధ



## ప్రముఖ ఛాయాగ్రాహకుడు వి. ఎస్. ఆర్. స్వామి దర్శకత్వంలో మూడు 3–డి చిత్రాలు

'నేను డైరెక్టర్‌ని అయ్యాక చేపట్టిన మూడు పిక్చర్‌లూ 3–డి వి అవడం, వాటి సబ్జక్ట్‌లు 3–డి టెక్నిక్‌కు అనువుగా ఉండడం నాకెంతో ఉత్సాహంగా ఉంది. అంటూ చాయాగ్రాహకుడిగా ఒక స్థానాన్ని పొందిన వి ఎస్ ఆర్ స్వామి ఆ చిత్ర వివరాలను తెలియజేశారిలా




నా ఒక్కడికే – నాలుగు టిక్కెట్లు ఇవ్వండి!

సి హెచ్ రాధారెడ్డి, సి హెచ్ సత్యనారాయణ నిర్మించే శ్రీ విద్య కంబైన్స్ జై భజరంగ భళి' చిత్రంలో జయసుధ ప్రదాన పాత్రదారిణి ప్రమోద్‌కుమార్ సమకూర్చిన రసవత్తరమైన కథకు సత్యానంద్ సంభాషణలకర్త చక్రవర్తి సంగీతం బాస్కరరాజు శిల్పం, డి వెంకటరత్నం కూర్పు తెరవెనుక హంగులు

శిరోమణీ ఇంటర్నేషనల్స్ బానర్‌లో జి దేవిశ్రీప్రసాద్ నిర్మించే ఇదే మా గురు దక్షిణ నృత్య, సాహసోపేతమైన చిత్రంలో నవ నటీనటులు పాల్గొంటారు సత్యమూర్తి సంభాషణలు, చక్రవర్తి సంగీతం, భాస్కరరాజు శిల్పం, డి వెంకటరత్నం కూర్పు, సీను నృత్యాలు వగైరా సాంకేతికవర్గం

ఈ రెండు చిత్రాలకన్నా ముందుగా భారీ తారాగణంతో హిందీలో పి బాబ్జీ నిర్మించే చిత్రం షూటింగ్ హైదరాబాద్‌లో మొదలవుతుంది

ఏపిల్ నెలాఖరుకు ఈ మూడు చిత్రాల షూటింగ్‌లు పూర్తవుతాయి □




(గత సంచిక తరువాయి)

రెండు రోజుల్లు గడిచాక కృష్ణ చైతన్యను అన్నయ్యా బోర్‌గా వుంది యెటైనా తీసుకు వెళ్ళు అని సాదించసాగింది

నీకా? బోరా? సదా హడావుడిగా వుండే రాధేనా యీమాట లంటున్నది?

పో అన్నయ్యా నీకన్నీ వేళాకోళాలే

మీ గాంగ్ యేమైంది నువ్వు నన్ను పట్టుకున్నావు?

వద్దులే నాదారి నేను చూచుకుంటాను

అంత కోపం కూడదు రాధా ఎటు వెళ్దాం అంటావు? సినిమాకా?

ఊహుఁ!

షాపింగ్?

ప్చ్

టాంక్‌బండ్?

అబ్బే

రాజారావు మిసెస్ యెప్పటి నుండో గొడవ వాళ్ళింటికి రావడం లేదని వెళ్దామా?

అసలే బోర్‌గా వుంటే ఆబోర్ కూడా భరించాలా?

'నువ్వే చెప్పు

నాకు లాంగ్ డ్రైవ్ చేయాలని వుంది దూరంగా వుండే స్నేహితుల్ని గుర్తుకు చేసికో

కృష్ణ చైతన్య పైకి కన పడకుండా నవ్వుకున్నాడు

శరత్ వద్దకు వెళ్ళవచ్చును కానీ ప్రయాణమే చాలా సమయం తీసికుంటుంది వెళ్ళాక యెక్కువ సేపు కూర్చోవద్దు నాకు పూరకనె అలా అలా తిరిగి రావాలనిపిస్తోంది

ఎంత అమాయకురాలు రాద! తను పైకి చెప్పే కబుర్లను నమ్మడానికి నేనేమైనా అమాయకుడ్నా అనుకుని లోపల పైకి మాత్రం 'ఓ కె నీయిష్టం మీరిద్దరూ బయల్దేరండి అమ్మా,నాన్న కూడా వస్తారేమో కనుక్కో అన్నాడు

> **జరిగిన కథ-9** · రామస్వామి, ప్రభావతమ్మల పెద్దకొడుకు కృష్ణచైతన్య, అక్కకూతురు రాజ్యలక్ష్మి చనిపోవడంతో ఆమె కూతురు ప్రబాతను తన ఇంట్లోనే ఉంచుకొంటుంది ప్రభావతమ్మ కృష్ణచైతన్యకు ప్రభాత అంటే అబిమానం ఆమెను ప్రైవేటుగా మెట్రిక్‌కు కట్టిస్తాడు ప్రబాత పట్ల అతని అభిమానం ప్రబావతమ్మలో ఘర్షణ కలుగ జేస్తుంది దీపావళి పండుగకు కృష్ణచైతన్య చెల్లెలు జయశ్రీ అందరికి కొత్తబట్టలు కొనుక్కొచ్చి ప్రభాత విషయం మరిచి పోతుంది కృష్ణచైతన్య అప్పటి కప్పుడు వెళ్ళి ప్రభాతకు చీర, జాకెట్ కొనుక్కొస్తాడు కృష్ణచైతన్య తమ్ముడు నందకిశోర్ తనో కన్నడ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్లు అన్నతో చెప్తాడు కృష్ణచైతన్య, రాధ, ప్రబాత షాపింగ్ చేసి సినిమా కెళితే అక్కడ చిన్ననాటి స్నేహితుడు శరత్ కలిసాడు శరత్, రాధలు ఒకరి పట్ల ఒకరు ఆకర్షితులవుతారు

ప్రబావతమ్మకు అప్పటి కప్పుడు బయల్దేరడం యేనాడు సాద్యం కాని విషయం రామస్వామిగారు ఈసారి చూద్దాంలే అన్నారు

ట్రాపిక్ తక్కువగా వున్నచోట రాద డ్రైవింగ్ నేను చేస్తానని మంకు పట్టు పట్టింది తప్పదని కృష్ణ చైతన్య అయిష్టంగానే అంగీకరించాడు

రాధ అలా మామయ్య ప్రక్కన కూర్చుని కారు నడుపుతుంటే వెనుక సీట్లో కూర్చున్న ప్రబాతకు యెంతో గొప్పగా అనిపించి మామయ్యా నాక్కూడా డ్రైవింగ్ నేర్పవా? అంది ముందుకు వొంగి

రాద కారు నడపడాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తున్న కృష్ణచైతన్య తల త్రిప్పకుండానే ఉహుఁ! అన్నాడు

రాధ పిన్ని యెంతో చక్కగా పూర్తి చేయలేక పోయింది అతని ముఖం చూస్తూ

మామయ్య నిరాకరించడానికి, కరకుగా తిరస్కరించడానికి కారణం యోచిస్తూ వుండగానే కారొచ్చి వో యింటి ముందు ఆగింది కృష్ణచైతన్య యింటి నంబర్ చూచి కారు దిగాడు

నువ్వు చూచిరా అన్నయ్యా అంది రాధ దిగకుండానే

అదృష్ట వశాత్తు శరత్ యింట్లోనే వున్నాడు

కృష్ణచైతన్య ఆ విషయం చెప్తూ వుండగానే రాద చెంగున కారు దిగింది వెనుక డోర్ తలుపు తీసి పట్టుకుంటూ దిగు మొద్దూ అన్నాడు

ప్రబాత దిగాక డోర్స్ లాక్ చేసి చూస్తే రాధ అక్కడ లేదు ఆమె అప్పటికే ఆ యింటి ముందున్న ఫెన్సింగ్ గేటు తీసుకుని, ఆ కొద్దిపాటి స్థలాన్ని దాటుకుని గబగబా నడచి లోనికి అడుపెట్టింది ప్రభాత రాదను అనుసరించాలో, మామయ్యకోసం ఆగాలో అర్ధంకాని అయోమయంలో ఫెన్సింగ్ వద్ద ఆగిపోయింది ఆమెను సమీపిస్తూ 'నడిపే బాధ్యత పురుషునిమీద ఉంచి స్త్రీ నిశ్చింతగా, సుఖంగా అతని ప్రక్కన ప్రయాణం చేయడం యిరువురి మనసులకూ హాయినిగొలుపుతుంది ప్రభా' పద వెళ్దాం అన్నాడు

శరత్ వారిని సాదరంగా ఆహ్వానించాడు అతడు కూడా అప్పుడే వచ్చినట్లున్నాడు ఫీల్డ్ మీదకు వెళ్ళాను ఆలస్యం అయ్యింది అన్నాడు

కాని సమయంలో వచ్చి మీకు ఇబ్బంది కలిగించటంలేదు కదా?' రాధ

లేదు మీ రాక వల్ల అలుపు తీరి రిఫ్రెష్ అయ్యాను

అతిశయోక్తి కాదులే అనుకున్నాడు కృష్ణచైతన్య

పందెం వసూలు చేసుకోను వచ్చాను

బహుమానం సిద్ధంగా వుంది నువ్వొచ్చి తీసుకుపోవడం మా అదృష్టం

మా అంటే యెవరేమిటి?

నాఅదృష్టం, ఆ బహుమతి అదృష్టం అని అర్ధం

కృష్ణచైతన్య అతని చిన్న తోటను పరిశీలిస్తుంటే రాద అతని యింటిని గమనించడంలో ఆసక్తి ప్రదర్శించింది బయట అతను పెంచుతున్న మొక్కలు చూశాక మీక్కూడా గార్డెనింగ్ యిష్టమా? అంది ప్రభాత

నాచురల్లీ

బాచిలర్ క్వార్టర్స్ నవ్వకండి అన్నాడు యిల్లు చూపిస్తూ

చాలా నీట్‌గావుంది' కృష్ణచైతన్య మనస్ఫూర్తిగా మెచ్చుకున్నాడు

మారేజ్ అయ్యాక వేరే క్వార్టరు యిస్తారా? అంటున్న రాధ కళ్ళల్లోకి లోతుగా చూశాడు కృష్ణచైతన్య

ప్రమోషన్ వచ్చేవరకూ యిదే క్వార్టర్

అన్ని వసతులతో ముచ్చటగొలుపుతూందా యిల్లు ముందున్న చిన్న వరండాలో నాలుగు కేను కుర్చీలు టీపాయ్ వేశాడు లోపల వున్న డైనింగ్ రూంలో ఒక స్టూలు, దానిమీద పేపర్లు తప్పించి ఖాళీగా వుంది రెండు గదుల్లో ఒకదాన్ని మాత్రమే శరత్ ఉపయోగిస్తాడు రెండవ గదిలో అతని పనివాడు సాంబు పడుకుంటాడు?

మీరొక్కరి కోసం పనివాడా?

మరేం చేయను? నాకేమో గ్యాస్ట్రిక్ ట్రబుల్ వుంది హొటల్ భోజనాలకు స్వస్తి చెప్పాను వంటచేసుకోను రాదు

"పెళ్ళయ్యాక మాన్పిస్తాడులే కృష్ణచైతన్య

పెళ్ళయ్యాకే పని అధికమవుతుంది రాధ

ముందు కృష్ణ పెళ్ళికావాలి వాడు నాకన్నా పెద్దవాడు

నీ పెళ్ళి ముందు జరిగే సందర్భం వస్తుందనిపిస్తోంది అంటున్న మిత్రుని కన్నుల్లోకి నిశితంగా చూశాడు శరత్

సాంబు యిచ్చిన టీ, బిస్కెట్లు తీసుకున్నాక వెళ్తాం శరత్' అంటూ లేచాడు కృష్ణచైతన్య

ఇక్కడ భోజనాలు చేసి వెళ్ళండి సాంబువంట చేస్తాడు కాబట్టి నాకు యిబ్బంది లేదు కారుంది కనుక మీకూ యిబ్బంది లేదు'

సారి శరత్ ఇంకొకసారి వస్తాము నా స్టడీ వర్క్ చాలా వుంది అంటున్న కృష్ణచైతన్యను అనుసరించక తప్పలేదు రాధకు

మీ బహుమానం" అంటూ చీరపాక్‌ను రాధ కందించాడు తెల్లటి బిన్నీ జార్జెట్ మీద అక్కడక్కడ జరీ బుటా, బార్డర్ మీద నాలుగు జరీ గీతలు, చాలా ఖరీదైన చీరె అది

అంత విలువైన కానుకను తీసికోను రాధ సిద్ధంగాలేదు

ఇది నేను వూరకనే యివ్వడంకాదు రాధా నీ కష్టార్జితం'

ఊహు! మీరేదైనా చిన్న వస్తువిస్తే నేను సంతోషంగా పుచ్చుకునేదాన్ని"

మన షరతు ప్రకారం యిచ్చింది పుచ్చుకోవాలి పేచీలు పెట్టకూడదు"

నువ్వైనా చెప్పు కృష్ణా

నువ్వింత విలువైనది కొనకుండా వుండాల్సింది'

వీళ్ళిద్దరూ యిలా అంటున్నారు చూడమ్మా ప్రభాత రేపు వీడేమో డైమండ్ రింగ్ పందెం క్రిందయిస్తే, నేనుపెన్నో పుస్తకమో యిచ్చాననుకో నా పరువేం కావాలి?

తీసికో రాధా' అని కృష్ణచైతన్య హెచ్చరించడంతో తప్పలేదు రాధకు

పర్ఫ్యూమ్ బాటిల్ ప్రభాత చేతికిస్తూ ఇది నీకమ్మా' అన్నాడు

ఎదురు చూడని విషయం అంగీకరించాలో, నిరాకరించాలో ఆమెకు వెంటనే తోచలేదు రాధను సాగదీయడానికే అతనికి వోపిక నశించి వుండాలి ఆమె కృష్ణచైతన్యను చూచింది అతని సంజ్ఞని గుర్తిస్తూనే-

థాంక్సు అంకుల్ అని తీసికుంది

ముగ్గురూ శరత్ వద్ద శెలవు తీసుకుని బయల్దేరారు

*   *   *   *   *

శరత్ ప్రతి ఆదివారం వస్తున్నాడనే చెప్పాలి అతడు మధ్యాహ్నం పన్నెండు గంటల ప్రాంతంలో వస్తాడు సాయంత్రం ఐదు గంటల వరకూ అక్కడే కాలక్షేపం చేస్తాడు కృష్ణచైతన్య స్నేహితుల, పరిచయస్తుల పరిధి పెద్దది అనేక కార్యక్రమాలలో మునిగి తేలుతూ వుంటాడు అందుచేత అతడు ప్రతి ఆదివారం శరత్ కోసం యింట్లోనే కూర్చోలేడు అతను బయటకు వెళ్ళినప్పుడు రాధ, శరత్ యెక్కువగా మాట్లాడుకుంటారు ఎప్పుడో తప్పించి రామస్వామిగారు వారి సంభాషణలో పాలుపంచుకోరు ప్రభాత అయిదు లేక పది నిమిషాలు వారి వద్ద కూర్చుని వెళ్తుంది. ప్రభావతమ్మగారు తన పని తాను చేసుకుంటూనే మధ్య మధ్య వొక్కో మాట అందుకుంటారు

ఇలా కొన్ని ఆదివారాలు గడిచే సరికి ప్రభావతమ్మకు ర ధ యింటి వద్ద వున్న చదవదన్న విషయం అర్థమయ్యింది పరీక్షలు నెల రోజులున్నాయనగా కృష్ణచైతన్య ప్రభాతను ట్యుటోరియల్ కాలేజీలో చేర్పించాడు

"అన్నయ్య చూడమ్మా ప్రభాతను అంతసేపు చదివిస్తాడా? నా విషయమే పట్టించుకోడు' ఫిర్యాదుచేసిందొకరోజు

అనుకోని యీ నిందకు అతడు తెల్లబోయి "అదేమిటి రాధా నీ సబ్జెక్ట్సు నా సబ్జెక్ట్సు వేరు అయినా నువ్వడిగితే నేనెప్పుడు హెల్ప్ చేయలేదు? అన్నాడు

ఎకనమిక్సు కష్టంగా వుంది

ఆ సబ్జెక్ట్సు నాకేమీ తెలియదు ఐకాన్ట్ హెల్ప్ యూ మా కొలీగ్‌ను నేనొక నెల కోచింగ్ యివ్వమని రిక్వెస్ట్ చేస్తాను

రాధకు కావల్సింది కోచింగ్ కాదు అతను యూనివర్సిటీలో రీడరుగా పని చేస్తున్నాడు అన్ని డిపార్ట్‌మెంట్‌లవారితోనూ అతనికి పరిచయమూ, స్నేహమూ వున్నాయి వాళ్ళ నడిగి గెస్ పేపర్ తెచ్చిపెట్టాలని ఆమె కోరిక అతనికి యీ పద్ధతులు యిష్టంలేదు పోయిన సంవత్సరమే ప్రయత్నించి విఫలు రాలైంది రాధ అందువల్లన యీసారి క్రొత్త పంథా త్రొక్కినప్పటికీ లాభం లేక పోయింది

ఇద్దరి పరీక్షలు వొకదాని తరువాత వొకటి ముగిశాయి చివరి పరీక్ష వ్రాసివచ్చి నిశ్చింతగా నిట్టూర్చింది రాధ ఈ రోజుతో చదువు పీడా పోయింది అనుకుంది స్నేహితులతో కలసి మరునాడే జూకు వెళ్ళింది

పరీక్షలు వ్రాశాక ప్రబాత పరిస్థితి వేరుగా వుంది రాధలా ఆమెకు చదువు ముగియటం లేదు ఆరంభం కానున్నది

మామయ్యా నేను తప్పకుండా పాసవుతాను అంది చివరి పరీక్ష వ్రాసొచ్చి

గుడ్ పాసవుతానని దిగులుగా చెప్తావెందుకు?

నాకు యింకా చదువుకోవాలని వుంది

కృష్ణ చైతన్యకు వెంటనే ఆమె విచారం వెనుకదాగిన ఆలోచన అర్థమైంది

చదువుకో

తాతయ్య యేమంటారో!



కృష్ణచైతన్య ఆలోచనలో పడిపోయాడు

తాతయ్య వద్దన్నా నువ్వు నన్ను చదివిస్తావా మామయ్యా ఆశగా అడుగుతున్న ఆమెను చూస్తే జాలి కలిగింది ఆమె అలా దీనంగా దిగులుగా వుండటం నచ్చలేదు అలా ఆమె జాలిగా తనను వేడుకునేలా ట్రీట్ చేస్తున్నాడా తాను ఆమెను? అతను పరిపరివిధాల తర్కించుకుని నువ్వు చదువుకోవాలనుకున్నది చదువుకో నలుగురు మెచ్చే యే పని చేయడానికీ నువ్వు మరొకరి యిష్టాయిష్టాల మీద ఆధారపడనవుసరం లేదు – అన్నాడు

అతడు కలిగించిన ధైర్యంతో ఆమె కొండెక్కినంత సంబరపడింది అందరిలా తన యిష్టప్రకారం తాను వెళ్ళవచ్చును మామయ్య అండ తనకు వుంది తనకు మామయ్య వున్నాడు అంటే ప్రపంచంలోని సర్వబాంధవ్యాలూ వున్నట్లే

ఆమె ఆత్మ విశ్వాసం కలిగించిన నూతనోత్తేజంతో ప్రకాశింపసాగింది

★ ★ ★ ★

యూనివర్సిటీకి సెలవులు యిచ్చేముందు ఇంగ్లీషు డిపార్ట్మెంటు వారు అజంతా, ఎల్లోరా సెలవుల్లో వెళ్ళాలని నిశ్చయించుకున్నారు అందరూ కుటుంబాలతో వస్తున్నారు కాబట్టి కృష్ణచైతన్య ప్రబాతనూ, రాదనూ తీసికు వెళ్ళదలచి వారి పేర్లు కూడా వ్రాయించాడు

ఇంతవరకూ హైద్రాబాద్ తప్ప మరేమీ సందర్శించని ప్రభాత ప్రయాణం రెండు రోజులుందనగానే సర్దటం మొదలు పెట్టింది ఆమె వుత్సాహానికి రాధ, కృష్ణచైతన్య నవ్వుకున్నారు ఆమె సర్దుడు ముగియకముందే ఆమెను నిరుత్సాహపరుస్తూ రాద అనారోగ్యానికి గురయ్యింది

రేపు సాయంత్రం కదా మన ప్రయాణం అప్పటికి నీకు తగ్గిపోతుంది పిన్నీ తన ఆశాబావాన్ని వ్యక్తంచేసింది

జ్వరం తగ్గినా నేను రేపు రాలేను నువ్వెళ్ళు అన్నయ్యతో అంది నీరసంగా నవ్వుతూ

నేనొక్కదాన్నా?

చాలామంది స్త్రీలు, పిల్లలు వస్తారు నీకేం ఫర్వాలేదు

రాద ధైర్యాన్ని కలిగించినా, ఆమెకు వెళ్ళాలని వున్నా కృష్ణచైతన్య తీసికు వెళ్ళే నమ్మకం ఆమెకులేదు కృష్ణచైతన్య యేనిర్ణయానికి రాకముందే –

ఎప్పుడు రావడం రమేష్? ఎక్కడి నుండి? అంటూ తన చిన్నన్నయ్య చిన్న కొడుక్కు యెదురెళ్ళి ఆప్యాయంగా లోనికి ఆహ్వానిస్తోంది ప్రభావతమ్మ అతన్ని చూచిన ఆనందంలో ఆమె కళ్ళు తృప్తిగా మెరుస్తున్నాయి

సూట్‌కేస్ క్రిందపెట్టి మద్రాసు నుండి సరాసరి వస్తున్నానత్తా అన్నాడు కూర్చుంటూ

ఏమిటో యీ విశేషాలు? పేపరు వదలకుండానే పరామర్శించారు రామస్వామిగారు

కృష్ణచైతన్యను చూస్తూనే చెయ్యి చాచాడు ఆప్యాయంగా పలుకరించుకున్నారు

చిక్కిపోయావు రమేష్

నువ్వంటే అదృష్ట వంతుడివి ఇంకా అత్తయ్య సేవలు అందుకుంటున్నావు

రమేష్‌కూ కృష్ణచైతన్యకూ చిన్నతనంనుండే మంచి స్నేహం వుంది దాదాపు ఒకే వయసు వారవడం వలన బాల్యంలోనే నేస్తం కట్టారు అభిరుచులు, అభిప్రాయాలు కలవడం వలన పెద్దయ్యాక కూడా వారి స్నేహలత మరింత పెరిగి క్రొత్త చిగుర్లు వేసింది రమేష్ బి యి హైద్రాబాద్‌లో ప్రభావతమ్మ వద్ద వుండి చదువుకున్నాడు ఆ ఐదు సంవత్సరాల కాలంలో మరింత సన్నిహితులయ్యారు అతనికి అత్తయ్య, మామయ్య లంటే యెనలేని గౌరవం

రెండు కుటుంబాల మధ్య నున్న సంబంధాన్ని పటిష్టం చేసికోవాలని యిరు







పక్షాల వారు తలంచారు కాని జయశ్రీను వివాహం చేసికోను రమేష్ అంగీకరించ-లేదు ప్రభావత బిడ్డలతో పాటు అతడు కలసి మెలసి జీవించాడు వాళ్ళ నలుగురిలో తాను ఒక్కడిగానే భావించుకున్నాడు వారందరి మధ్యా సోదర భావం కలిగింది హఠాత్తుగ్గా పెద్దలు యీడూ జోడు కుదిరింది ముడి వెయ్యమంటే అతడు మొరాయించాడు అతను చెప్పింది వినగానే తండ్రి రామయ్యకు వెర్రికోపం వచ్చింది

బడుద్దాయి వేరెసొక్కె దొరకలేదుట్రా? మేనత్త కూతురు చెల్లిలా అన్పిం-చిందా? సినిమా కబుర్లు నేర్చావురా అన్నాడు ఆవేశాన్ని అణచుకోలేక

అతన్ని ప్రభావతమ్మ వారించింది ఆమె రమేష్‌ను పూర్తిగా అర్ధంచేసికో గలిగింది విషయం విన్న రామస్వామి గారు మిన్నకుండిపోయారు ఈ విషయం జయశ్రీకి యింత వరకూ తెలియదు రమేష్ స్వగ్రామం యెప్పుడు వెళ్ళినా విజయవాడలో జయశ్రీని చూడకుండా రాడు వారి మధ్య నున్న అనుబందాలు అలాంటివి

ఇంతకూ రాదేది? చుట్టూ పరికిస్తూ అడిగాడు రమేష్

విషయం తెలుసుకుని ఆమె గదిలోకి వెళ్ళి ఆమెను పరామర్శించాడు

నువ్విలా మంచానికి అతుక్కుని వుంటే నాకేమీ బాగోలేదు రాధా

నాకు బాగాలేదని మీరేమీ బాధ పడకండి నాలుగు రోజుల్లో నేను మామూలుగా వుంటాను అంతెందుకు? మీరు అజంతా, ఎల్లోరా నుండి వచ్చేసరికి నేను పరుగెత్తుతూ యెదురొస్తాను

రమేష్‌కు అజంతా, ఎల్లోరా వ్యవహారం అర్ధం కాలేదు

కృష్ణచైతన్య చెప్పాడు

'నా బదులు నువ్వెళ్ళు బావా

ఆమె సలహా అందరికీ నచ్చింది

కొద్దిసేపు రెస్ట్ తీసికుంటే సాయంత్రం తిరిగి ప్రయాణం చేయవచ్చున ని కూడా రాధే సూచించి-

మూడు గంటల వరకూ చలనం లేకుండా వున్న ప్రభాతతో అదేమిటి యింకా అలాగే వున్నావు? మనం నాలుగ్గంటలకు స్టేషన్లో వుండాలి" అన్నాడు

నేను కూడా వస్తున్నానా మామయ్య సంభ్రమంగా అడిగింది

ఎందుకు రావు? త్వరగా సిద్ధం కావాలి '

ఈ సంభాషణ వింటున్న ప్రభావతమ్మ వంట యింట్లోనుండి పిలిచింది

ఏమిటమ్మా" ఆమె దగ్గరకు వెళ్ళి అడిగాడు

దాన్ని కూడా తీసికు వెళ్తావా?" అంది

అవునమ్మా

రాధ తోడుగా వుంటే వేరు ప్రైగా రాదక్కూడా బాగాలేదు ఉంటే నాకు తోడుగా వుంటుంది

నువ్వు చెప్పింది నిజమే నమ్మా రెండు రోజుల నుండే సర్దింది పాపం చిన్నపిల్ల వద్దంటే నిరుత్సాహపడుతుంది అందరూ కుటుంబాలతో వస్తున్నారు కాబట్టి పర్వాలేదు అన్నాడు

నీయిష్టంరా అయిష్టంగానే అంది

అనుకున్న సమయానికి, అనుకున్న విధంగా అంతా సవ్యంగ్గానే జరిగింది

కృష్ణచైతన్య ప్రభాతను సింగ్ గారి కుటుంబంతో కూర్చోబెట్టబోయాడు వారికి ప్రభాత వయసులో వున్న కూతురుంది ఆమె ప్రభాతకు కంపెనీ యిస్తుందని అనుకున్నాడు

నేను మీతోనే కూర్చుంటాను మామయ్యా వాళ్ళకు తెలుగు అర్ధంకాదు నేను ఇంగ్లీషు మాట్లాడలేను అంది సిగ్గుపడుతూ

ఒ కె ఒ కె పద అంటూ మరో చోటకు దారి తీశాడు

కృష్ణచైతన్య రమేష్, ప్రభాత స్థిరపడి కూర్చున్న కొన్ని నిమిషాలకే వొక స్త్రీ వచ్చి మరో సీటును ఆక్రమించుకుంది

ఆమెను చూస్తూనే ప్రభాత కళ్ళు మెరిశాయి ప్రకృతిలోని అందాలన్నింటిని రాశి చేస్తే తయారైన రూపమామెది ఏ భంగిమలో, యేకోణం నుండి చూచినా అద్భుతంగా అగుపిస్తుంది ఏ దేవతనుండో వరంగా తెచ్చుకున్న అందం ఆమెది తనను రెప్ప వెయ్యకుండా చూస్తున్న ప్రభాతను చూచి చిరునవ్వు నవ్వింది, మల్లెలు విచ్చుకుంటున్నట్లు వెన్నెల కురుస్తున్నట్లు భావన కలిగించి మనసుకు ఆహ్లాదాన్ని కలిగించిందా నవ్వు

ప్రభాత ప్రక్కన కూర్చుంటూ కృష్ణచైతన్యతో యేమి మాట్లాడిందో ప్రభాత వినిపించుకోలేదు కృష్ణచైతన్య చిరునవ్వే జవాబుగా యివ్వడంతో తన సూటుకేసు అక్కడే వదలి క్రిందకు దిగి వెళ్ళిందామె

ఆమె వెళ్ళిన వైపే చూస్తూ ఎవరు మామయ్యా ఆమె? అంది

"డాక్టర్ విద్య

నీకు ముందే తెలుసా?

ఆమె నాతో పాటు మా డిపార్టుమెంట్‌లో నే పని చేస్తోంది

ఇప్పటివరకూ కనుపించలేదు

**ఆమె యిప్పుడే వస్తోంది "**

**కృష్ణచైతన్య తిరిగి రమేష్‌తో కబుర్లలో పడ్డాడు**

ట్రెయిన్ కదలబోయే సమయానికి వచ్చి తన స్థానంలో కూర్చుంది విద్య

కృష్ణచైతన్య రమేష్‌నూ, ప్రభాతనూ ఆమెకు పరిచయం చేశాడు

కొన్ని మాటల అనంతరం విద్య తనతో తెచ్చుకున్న పుస్తక పఠనంలో లీనమైపోయింది

## మౌనవిపంచి

తెలతెలవారుతుండగా ఔరంగాబాద్ చేరుకున్నారు. ముందుగానే బుక్ చేసికోవడం వలన లాడ్జింగ్ విషయమై యిబ్బంది కలుగలేదు. బసకు చేరాక యెవ్వరికీ విశ్రాంతి తీసికోను సమయమే దొరకలేదు. వచ్చిన వెంటనే టూరిస్టు-బస్‌ను మూడు రోజులకై మాట్లాడారు. ఆ రోజు అజంతా వెళ్ళాలని తీర్మానించుకున్నారు. బస్సులో విద్య ప్రక్కన కూర్చోవాలన్న ప్రభాత ఆశ నెరవేరలేదు. పరిచయం పెంచుకోను తగిన వారెవ్వరూ లేరు. ప్రభాత వయసువారైన యిద్దరమ్మాయిలు వున్నారు కానీ వారు తెలుగువారిలా కనుపించలేదు. జుత్తు భుజాలవరకూ కత్తిరించుకుని, మాక్సీలు ధరించి, ఇంగ్లీషులో సంభాషించుకుంటూ అందర్నీ తమవైపే ఆకర్షించే ప్రయత్నంలో వున్నారు. ప్రభాత ఒంటరితనాన్ని అనుభవిస్తోందని గ్రహించిన కృష్ణచైతన్య అజంతా చేరినప్పటినుండీ ఆమెను తనతో వుండమని ఆదేశించాడు.

అజంతాలో టూరిస్ట్ శాఖవారి కాన్‌టీన్‌లో భోజనాలు చేసి గుహలు చూడను సిద్ధపడ్డారు. వెంట వచ్చిన లైసెన్స్‌డ్ గైడ్ బస్సులోనే అజంతాకు పరిచయ వాఖ్యాలు పలికారు.

"ప్రభాతా అటూ యిటూ వెళ్ళకుండా నాతోనే ఉండు. ముందుగా చూడబోయె గుహలు చీకటిగా వుంటాయి."

"చీకట్లో యెలా చూడగలం?"

"లైట్లు అమరుస్తారు. నువ్వు మాత్రం లోపల దేన్నీ తాకవద్దు." గైడ్ అంతకుముందు ఇంగ్లీషులో వివరించిన విశేషాలను తెలుగులో విడమర్చి చెప్పాడు. అతని చేతిలో పాత డైరీ ఒకటి వుంది. మధ్య మధ్య దాన్ని చూస్తున్నాడు.

"ఆ డైరీలో నువ్వు నోట్సు వ్రాసుకున్నావా మామయ్యా?"

"అవును. చదువుకునే రోజుల్లో స్నేహితులతో కలసివచ్చాను. అప్పుడు వ్రాశాను. నువ్వు చూడు."

నాకు బాగా అర్ధంకాదు మామయ్యా

తెలుగులో కూడా వ్రాశాను

ప్రబాత అతని డైరీ తీసికుంది ముందుగా అజంతాకు పరిచయ వాఖ్యాలు వ్రాసి తరువాత కెవ్ నెంబర్ ఒకటి, రెండు, మూడు అని హెడ్డింగులు యిచ్చి వాటి క్రింద ఆయాగుహల విశిష్టతను వ్రాశాడు

ఆ డైరీ చేతిలో వుండగా గైడ్ అనవసరం అనిపించింది ఆమెకు

అందరి చేతుల్లోనూ కెమెరాలు వున్నాయి కృష్ణచైతన్య ప్రభాతనూ, శిల్పాలనూ వివిధ రకాలుగా ఫోటోలు తీశాడు అంతా తనే ఎడ్జస్టు చేసి ఆమెకిచ్చి తననూ, రమేష్‌ను తీయమన్నాడు

క్లిక్ చూపిస్తూ దీన్ని నొక్కు చాలు అన్నాడు

"మన మొఖాలు పడ్తాయంటావా?" రమేష్‌కు అనుమానం

మనం కాకపోయినా వెనుకనున్న శిల్పాలో, ప్రకృతి దృశ్యాలో, యేదో ఒకటి రాకపోతాయా!"

ఉత్సాహంతో కేరింతలు కొడ్తూ, నవ్వులు, హాస్యాలు, పాటల మధ్య కాలం గడిపి సాయంత్రానికి అలసిపోయి ఔరంగాబాద్ చేరుకున్నారు రాత్రి భోజనాలయ్యాక పడకల సమస్య వచ్చింది కృష్ణచైతన్యకు కుటుంబానికో గది చొప్పున బుక్‌చేసుకున్నారు ఒక్కొక్క గదిలో నాలుగు మంచాలవరకూ వున్నాయి గదిలో ఏర్పాటైన బెడ్స్‌నుబట్టి అద్దె కట్టాల కృష్ణచైతన్య గదిలో రాధ స్థానంలో మరో పురుషుడు వున్నాడు ప్రభాతను తమతో వుంచటం అతనికి యిష్టంగాలేదు విద్య గదిలో ఆమె ఒక్కటే వుంది కృష్ణచైతన్య తమకు అనుకోకుండా వచ్చిన సమస్యను ఆమెకు విశదీకరించి మీరు అన్యదా బావించకుండా ప్రభాతకు మీ గదిలో స్థానం యిస్తారా? అన్నాడు

ఆమె ఆనందంగా ఆమోదించింది

మీకు యిబ్బంది లేదు కదా!

నాటిటాల్ కంపెనీ లభిస్తున్నందుకు సంతోషంగా వుంది

గెస్ట్‌హవుస్ అదికారులతో చెప్పి ఆ గదిలో మంచం వేయించాడు విద్య ప్రబాతను చిరునవ్వుతో ఆహ్వానించింది ఆమె పేరు అడిగి తెలుసుకుంది ఏమి చదువుతున్నావని ప్రశ్నించింది

ప్రభాత జవాబు చెప్పింది

డాక్టర్ కృష్ణచైతన్య మీకేమౌతారు?

మామయ్య

ఆ రాత్రి అదికం సంభాషించుకోలేదు

తెల్లవారాక హడావుడి ప్రారంబం ఎల్లోరా ప్రయాణానికి సంసిద్ధం

ఆ రోజు ప్రభాత కోరిక నెరవేరింది ఆమెకు డాక్టర్ విద్యతో కలసి తిరిగే అవకాశం చిక్కింది ఆమెతో కలసి తిరుగుతుంటే కించిత్ గర్వం కూడా కలిగింది, అక్కడవున్న స్త్రీలందరిలోనూ విద్య, విద్యాదికురాలు మామయ్యతో సమానంగా డాక్టరేట్ పుచ్చుకుంది అజంతా శిల్ప సుందరికన్నా అందమైనది అయినా ఆమెలో అహంలేదు అతిశయం లేదు అందర్నీ ఆప్యాయంగా పలుకరిస్తుంది గౌరవిస్తుంది ఆమె పెదవులమీద చిరునవ్వు వాడని రోజాలా సదా నాట్యమాడుతుంది

ఆమె విద్యను ఆరాదించడం గమనించి నవ్వుకున్నాడు కృష్ణచైతన్య

మామయ్య నన్నూ, విద్య ఆంటీని కలిపి ఫోటో తీయవా?

కెమెరా సరిచేసుకుంటున్న కృష్ణచైతన్య ప్రబాత చెంతనే వున్న విద్యను మీకేమైనా అభ్యంతరమా మేడమ్? అని ప్రశ్నించాడు

నాటిటాల్

ఈసారి స్నాప్స్ తీయడానికి రమేష్ ముందుకు వచ్చాడు కత్తిపట్టిన యోధుడిలా విజృంబించి ఫోటోలు తీస్తుంటే విద్య చాలునని చెప్పడానికికూడా సంశయించింది అసలు అతడా అవకాశమే కలిగించలేదు తరువాత అతడు విద్యతో సంభాషణ ప్రారంభించి, దాన్ని లాగి లాగి సాగదీయసాగాడు

కృష్ణచైతన్య ప్రబాతకు ఎల్లోరాలోని అందాలను వర్ణించడంలో మునిగిపోయాడు

**(ఇంకా వుంది)**

# మీ పాప, పుట్టిన 6 గంటల తర్వాత మీ నుంచి 'నివారక ఆహారం' పొందుతుంది. దాన్ని యిచ్చేది మీరే యుగయుగాలుగా తల్లి యొక్క స్వాభావిక సంస్కారం యిది.



**తల్లి పాలు ప్రకృతి యిచ్చే మహత్వ పూర్ణమైన వరం!**

ఎందుకంటే పాప పుట్టుకతోనే తల్లి స్తనాలలో పాలు వస్తాయి. మరి వాటిలో ప్రాకృతికమైన రూపంలో "రోగ నిరోధక ద్రవ్యాలు" ఉంటాయి దాంతో, అప్పుడే పుట్టిన పాపయొక్క అమాశయం, పేగుల్లోనివీ, యితర వ్యాధుల నుంచి రక్షణ కలుగుతుంది. అందుకే స్తన్యపానానికి అంత ప్రాముఖ్యత యివ్వబడింది

## స్వాభావికమైన పోషణ

శరీర నిర్మాణంకోసం ప్రకృతిలోని ప్రోటీన్లు, శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లూ, ఆరోగ్యాన్ని కాపాడే విటమిన్లూ సరియైన మోతాదులో ఉండి, తల్లి పాలను సరిగ్గా సంతులితంగా కూడా తయారుచేస్తాయి— అప్పుడే పుట్టిన పాపకది సరియైన పోషణనిచ్చే ఆదర్శమైన ఆహారం అవడంకోసం (ఉదాహరణకి, స్తన్యపానం చేసే పాపలకు విటమిన్ ఏ లోటువలన వచ్చే స్కర్వీ వ్యాధి రాదు సాధారణంగా) మరి తల్లి పాలు తాగిన పాప ఎలా పెరిగి, పెరుగుతాడో చూడండి! ఇక మీరు మీ పాపను గుండెలకి హత్తుకుని పాలిస్తుంటే ఎంత ఆనందాన్ని పొందుతారని! మరి ఆ పసికందు యింత పెద్ద లోకంలో కేవలం మీ మమతను పొంది ఎంత సురక్షితంగా వున్నట్టి అనుభవాన్ని పొందుతాడని!

## ప్రపంచమంతా ప్రచలితం

ఇప్పుడు రోజుకి రోజూ, ప్రపంచమంతటా ఎక్కువ మంది తల్లులు, అంటే పశ్చిమ దేశాలలో సహితం, తల్లులు తమ పాలే యివ్వడం మొదలెట్టారు. ఎందుకంటే, తల్లి పాలలోని అమూల్య పోషక తత్వాల మహత్తర లక్షణాన్ని మళ్ళీ అవగాహన చేసుకోవడం మొదలెట్టారు.

## తప్పకపోతే

మరి మీరేగనక యిక ఏ కారణం వల్లనైనా తప్పకపోతే, మీ పాపకు మీ పాలు యివ్వలేకపోతే—అంటే మీ ఆరోగ్యం సరిగా లేకనో, లేదా మీలో, సరిపడినన్ని పాలు పడకో, అలా జరిగినప్పుడేం చెయ్యాలి మీరు? అటువంటి సందర్భంలో మీరు ఎంతో ఆలోచించిన మీదట, ఎటువంటి ఎటువంటి ఆహారం యివ్వాలంటే, ఆ యిచ్చేది తల్లి పాల తర్వాత అన్నింటికన్న ఉత్తమమైనదిగా ఎంచుకునేదాన్ని

## స్ప్రే డ్రయిడ్ అమూల్ స్ప్రే

అమూల్‌స్ప్రే, పుష్టినిచ్చే దృష్టితో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీన్లు, దాంతోబాటే, తేలికగా అరగగలిగే కార్బోహైడ్రేట్లు, సరియైన సంతులిత రూపంలో అత్యావశ్యమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలు ఉన్నాయి ఇది అంతకు ముందే మరగబెట్టిన నీటిలో టక్కున కరిగిపోతుంది మొదటిగానే పేస్ట్‌లా తయారు చేయవలసిన అవసరం ఉండదు

## పొదుపు

అమూల్‌స్ప్రే. డబ్బాలలో దొరికే శిశుఆహారాన్నిటికన్న పొదుపైనది ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన— "శ్వేత విప్లవం" తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు

## జాగ్రత్త పడటం

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్నీ, సీసానీ, ఎప్పుడూ ఆరోగ్యరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి. పాప ఆహారాన్ని తయారు చేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి. పాప సరియైన పోషణకోసం, డబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదుల ప్రకారమే ఉచితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి.

**ఉచితం!** ఉపయోగకరమైన విషయాలు యీ అధ్యాయాల్లో ఉన్నాయి అవి- గర్భధారణ ప్రసవానికి ముందర జాగ్రత్త ప్రసవము తల్లి పాలు ఇతర ఆహారములు మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట, పిల్లవాని దిన చర్య పిల్లవాని అభివృద్ధి. జబ్బులను అరికట్టుట ప్రథమ చికిత్స. సాధారణ రోగములు జబ్బుతోనున్న పిల్లవాని సంరక్షణ, జ్ఞాపక ముంచుకోవలసిన విషయములు. ఈ పుస్తకం తెలుగు, ఇంగ్లీషు, హిందీ తమిళం, మలయాళం, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ భాషల్లో దొరుకుతుంది. దానికోసం పోస్ట్ బాక్స్ 10124, బొంబాయి 400 001 అడ్రసుకు మీ పేరూ, పూర్తి అడ్రసు యిస్తూ రు 1.25 స్టాంపుల్ని జతపర్చండి.




# అమూల్‌స్ప్రే

**తల్లిపాల తరవాతనే ఇది**

అమ్మకం చేయుంచునారు
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్,
పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001, గుజరాత్



ASP/AS TEL5/83



# ప్రేమకు కత్తిపోట్లు!

## ఆదూరి సావిత్రి

"సౌందర్యా నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను ఇలా రాయటం అసహజంగానే ఉండొచ్చు ఇంతకన్నా మార్గం లేక ఇలా రాస్తున్నాను ప్లీజ్ సౌందర్యా, నన్నర్థం చేసుకోండి కొన్ని నెలలుగా నన్ను చూస్తున్నారు నా ప్రవర్తనలో మికేమైనా లోపం కనపడిందా?

నన్ను అపార్థం చేసుకోకండి ఎదురుబడి అడిగితే మీరెలా తీసుకుంటారో అని ఈ లెటర్ రాస్తున్నాను మీరంగీకరిస్తే మనం పెళ్ళి చేసుకుందాం. మనం మేజర్లం మనకు మధ్యవర్తులొద్దు ఒకరి అభిప్రాయం ఒకరికి మనమే తెలియజేసుకోగల పరిస్థితులు మనకున్నాయి మీ నిర్ణయానికెదురు చూస్తూ

మీ

జయాకర్

తల ఎత్తి ఎదురింటి వేపు చూసింధి సౌందర్య జయాకర్ వరండాలో నిలబడి ఇటే చూస్తున్నాడు ఆది ఒక కాలనీ ఆ రెండిళ్లే తప్ప మిగతా ఇళ్ళు కాస్త దూర దూరంగా ఉంటాయి సౌందర్య బ్యాంకులో పని చేస్తోంది జయాకర్ ఆమె కొలీగ్ కొత్తగా వచ్చాడు

నిదానంగా లేచి అడుగులు వేస్తూ గేటు వరకూ వచ్చింది సౌందర్య

గబ గబా అడుగులు వేస్తూ ఆత్రంగా తమ గేటు తెరుచుకుని రోడ్డు మీదకొచ్చాడు జయాకర్ చేతిలో ఉత్తరాన్ని అతి నెమ్మదిగా చించి, ముక్కలు చేసి, రోడ్డు పక్కనున్న కాలవలోకి విసిరేసి తిరిగి వరండాలోకెళ్ళి, అక్కడ బకెట్‌లో ఉన్న నీళ్ళతో చేతులు శుభ్రంగా రుద్ది కడుక్కుంటున్న సౌందర్యను చూడగానే జయాకర్ ముఖం ఎర్రబడింది ఉక్రోషంతో గిరున వెను తిరిగి, లోపలికెళ్ళిపోయాడతను

మూసుకున్న ఎదురింటి తలుపుల వేపు నిర్లక్ష్యంగా చూసి, వాలు కుర్చీలో పడుకుని సగం చదివి ఒదిలిన నవల చేతుల్లోకి తీసింది సౌందర్య కానీ మూడ్ చెడిపోయింది ఆలోచనలు, జయాకర్ మీదికి తిరిగాయి కళ్ళు పుస్తకాన్నే చూస్తున్నా మనసు మాత్రం జయాకర్ మీద, మగవాళ్ళ మీద ఆమెకుగల ద్వేషాన్ని వెలిగక్కుతోంది కంటికి కాస్త నదరగా కనపడ్డ ఆడదాన్ని చూసి మగాడెందుకిలా వెర్రెక్కిపోతాడు? ఆమె తన చేతుల్లోకి వచ్చే వరకూ నువ్వే నా ప్రాణం అంటాడు నేను నీ దాసుణ్ణి అంటాడు ఆమెనో మహారాణిలా చూస్తాడు

ఒక్కసారి ఆమె తన చేతుల్లో చిక్కగానే ఇహ విజృంభించడం ప్రారంభిస్తాడు ఆమెనెలా ఒదిలించుకోవాలా అని ప్లానులేస్తాడు అంతవరకూ ఆమె పట్ల అతనిలో పొంగి పొర్లిన ప్రేమ నామ రూపాల్లేకుండా ఎగిరిపోతుంది

ఆమె అతనికోసం పాకులాడుతున్నకొద్దీ దూర దూరంగా జరిగిపోతుంటాడు ఆమె మీద అకారణమైన ద్వేషాన్ని పెంచుకుని చచ్చు ఎక్స్‌ప్లనేషన్లు తనకు తానే ఇచ్చుకుంటూ ఆమె గురించి చెడుగా ప్రచారం చేస్తూ ఎలా అయినా ఆమెన అణగదొక్కాలని చూస్తాడు

మగాడి ప్రేమకు సరైన నిర్వచనం ఇదే! కానీ ఈ సృష్టి మొత్తం మీద, మగవాడికి అత్యధికమైన ఆనందాన్నివ్వగలిగేది, నిస్సంశయంగా ఒక్క స్త్రీ మాత్రమే

కనీసం ఈ కృతజ్ఞత కూడా అతనికుండదు 'గాజుల గలగలల' కోసం రాజులు రాజ్యాలు కూడా ఒదలటానికి సిద్ధ పడేవారు' అంటారు

ఇదంతా ఒక్కసారి ఆమెను స్వంతం చేసుకునే వరకే ఆ తరవాత ఆమె అతనికి శాశ్వతమైన ఉంపుడుగత్తెగా మారాల్సిందే

ఏ మగాడి చరిత్ర విన్నా ఇంతకన్నా ఏమున్నది గర్వ కారణం

మగాడి మీద తనకు ఇంత ఖచ్చితమైన అభిప్రాయం ఏర్పడటానికి కారకుడు చక్రవర్తి

ఔను! చ...క్ర..వ ర్తి...!

అప్పుడు. అప్పుడు...

*                    *                    *

బి.ఎ. చదుతోంది సౌందర్య. చదువులోనే కాకుండా అల్లరిలో కూడా గొప్ప ఎక్స్పర్ట్ ఆ. క్లాస్‌కి ఆమె నాయకురాలు

"నా పేరు చక్రవర్తి ఇంగ్లీష్ లెక్చరర్‌గా ఇక్కడ జాయినయ్యాను...." క్లాస్‌కి తనను పరిచయం చేసుకుంటున్నాడు చక్రవర్తి

వెనక బెంచీలో నుంచి ఎవరో సన్నగా విజిల్ వేశారు .

"హే చక్రవర్తీ! రక్షింపుడు రక్షింపుడు...'

"ఏ ఏ సామ్రాజ్యాలకు తమరు చక్రవర్తులో సెలవిస్తారా స్వామీ "

ఇలా రకరకాలుగా తనకు లభిస్తున్న స్వాగతానికి ఏమాత్రం ఎగ్జయిట్ అవకుండా చిరునవ్వుతో రిసీవ్ చేసుకుంటున్నాడు చక్రవర్తి ఇరవై నాలుగేళ్ళుంటాయతనికి. తెల్లగా ఒక మాదిరి ఎత్తుతో ఆకర్షణీయంగా ఉన్నాడు. అతని కళ్ళు క్లాసంతా కలియజూస్తూ ఆడపిల్లల బెంచీలలో, మధ్యగా ఉన్న బెంచీ చివర కూర్చున్న అమ్మాయి మీద ఒక్క క్షణం నిలిచాయి డెస్టిమోనాకు ఒథెల్లో మీదగల ఇష్టాన్ని సకారణంగా వివరిస్తున్నాడు చక్రవర్తి...

తండ్రిని ఎదిరించి, ప్రగాఢమైన ప్రేమతో, ఆమె ఒథెల్లోను ఎలా చేరుకుందో అతి చక్కగా, భావయుక్తంగా వివరిస్తూ, మధ్య బెంచీ చివరకు, అప్పుడప్పుడు దృష్టిని పోనిస్తున్నాడు.

పసుపు రంగుకు, మెరూన్ కలర్ బోర్డరున్న కోటా ఆర్గండీ చీర, మెరూన్ కలర్ బ్లౌజ్ వేసుకున్న ఓ, పద్దెనిమిదేళ్ళ అమ్మాయి... పచ్చగా, నాజూగ్గా ఉంది. మధ్య మధ్యలో తల ఎత్తి తన వేపు చూస్తూ వెంటనే తల ఒంచుకుని, సీరియస్‌గా ఏదో రాసేస్తున్న ఆ అమ్మాయి తన పాఠాన్ని ఫాలో అవటల్లేదని, అర్థమవుతూనే ఉంది చక్రవర్తికి

ఏం చేస్తోందామె?

ఆ అమ్మాయిని లేపి "వాటీజువర్ నేమ్?" అన్నాడు చక్రవర్తి.

"మైనేమీజ్ . సౌందర్య " సాగదీసి ఒత్తి పలుకుతూ అల్లరిగా అన్నదామె

"ఏం చేస్తున్నారు?"

"మీరేదో అడుగుతుంటే.. జవాబు చెపుతున్నాను.."

క్లాసులో నవ్వులు తెరలు తెరలుగా, చిన్నగా వినిపిస్తున్నాయి...

సౌందర్య ముఖంలో... కళ్ళలో... పెదవుల కొసల్లో అదో రకమైన కొంటెతనం...! పెంకెతనం!

"నేనిప్పుడేం చెపుతున్నాను?" నిగ్రహంగా అన్నాడు చక్రవర్తి.

"ఇంగ్లీష్ పాఠం."

"చిత్రం! ఇంగ్లీష్ లెక్చరర్ ఇంగ్లీష్ పాఠం కాక, ఏం చెపుతాడింక?"

"ఇలా... ప్రశ్నలు కూడా.."

"ఆ కాయితం ఇలా ఇవ్వండి." ఆమె ఊహించనంత వేగంతో ముందుకొచ్చి, అన్నాడు చక్రవర్తి.

"ఏ కాయితం?" అమాయకంగా అంటూ, డెస్క్ మీదున్న కాయితాన్ని చేతుల్లోకి తీసుకోబోయింది సౌందర్య. అప్పటికే చక్రవర్తి చెయ్యి అక్కడుంది.

ఆమె చెయ్యి అతని చేతి మీద పడి, చటుక్కున వెనక్కెళ్ళింది.

"ఇలా ఇచ్చెయ్యండి! ప్లీజ్!" అంటూ దాన్ని అందుకుంటానికి ప్రయత్నించిందామె.

"నో!" అంటూ దాన్ని విప్పిన చక్రవర్తి ముఖం ఎర్రగా కందింది. ఒక్కసారి ఆమె కళ్ళలోకి చూసి, వెను తిరిగి డయాస్ దగ్గరకెళ్ళిపోయాడు...

క్లాస్ అయ్యేలోగా మళ్ళీ అతని చూపులు ఆమె మీదకు ఒక్కసారి కూడా పోలేదు...

స్టాఫ్ రూంలో కూర్చుని, జేబులోనుంచి ఆ కాయితాన్ని బయటకు తీశాడు చక్రవర్తి...

అతని ముఖంలో సీరియస్‌నెస్ పోయి క్రమంగా చిరునవ్వు చోటు చేసుకుంది

ఆ కాయితం మీద పరమ ఘోరంగా ఓ బొమ్మ గీసి సైన్సు బొమ్మల్లోలాగా సన్నటి గీతలు కొట్టి నెంబర్ను వేసి ఇది కన్ను ఇది ముక్కు ఇది నోరు అంటూ రాసి బొమ్మ చివర ది గ్రేట్ చక్రవర్తి అని టోకుగా రాసింది

ఉట్టి అల్లరేనా లేక చదువులో కూడా ఉందా చక్రవర్తి ఆలోచనలలో సౌందర్య అప్పుడే ప్రత్యేకంగా చోటు చేసుకుంది

కాలేజీ గేటు దగ్గర కనపడి సారీ సర్ నాకు, బొమ్మలు అందంగా గియ్యటం రాదు అన్నది సౌందర్య

ఆ బొమ్మను అందంగా గియ్యాలనుకున్నారా? అన్నాడు చక్రవర్తి

ఔను

ఎందుకో?

ఆ బొమ్మలో వ్యక్తి అందంగా ఉంటాడు కాబట్టి

ఐ సీ!

మీకేం కోపం లేదుగా? థాంక్స్ వస్తాను అంటూ వెళ్ళిపోతున్న సౌందర్య చొరవకు నవ్వుకున్నాడు చక్రవర్తి

* * *

ఒకసారి కాలేజీకి తను ఒక్కతే నడచొస్తోంది సౌందర్య

ఆమె పక్కగా స్కూటర్ ఆపి లిఫ్టివ్వనా? అన్నాడు చక్రవర్తి

ఇలా ఒంటరిగా వస్తున్న ఆడపిల్లను ఆటకాయించి లిఫ్టివ్వనా? అని అడగటం మర్యాద కాదు పెదవులు బిగించి అన్నది సౌందర్య

ఈ అమ్మాయిలో ఇంత కొంటెతనం ఎక్కడిది?! ఈమెతో మాట్లాడుతుంటే స్తబ్ధత అనే పదం ఆ చుట్టుపక్కల కూడా లేకుండా పారిపోతుంది!

ఎవరితోనైనా కలిసొస్తుంటే అడగొచ్చా? అన్నాడు చక్రవర్తి

అప్పుడు మీరడగరుగా

ఏం ?

భయం!

చత్! ఎవరిని చూసి?

నాతో కలిసొచ్చే వాళ్ళను చూసి

భయమెందుకు?

గోడలు ఖరాబవుతాయని

ఏ గోడలు?

కాలేజీ గోడలు

అయితే నాకేం? అది నేను కట్టించింది కాదుగా?

ఆ గోడ మీద చెక్కే పేరు మీదేగా?

నాదా?

మీదంటే సౌందర్యా చక్రవర్తి

సౌందర్యా చక్రవర్తి !?

సౌందర్యా చక్రర్తి !?

ఔను

రాసుకోనివ్వండి నాకేం అభ్యంతర లేదు అసలా పేరలా వింటుంటేనే థ్రిల్లింగ్‌గా ఉంది

ఉంటుందుంటుంది అరుగో మా ఫ్రెండొస్తోంది అదసలే పేపర్‌లాంటిది మీరెళ్ళిపొండి అన్నది సౌందర్య ఆ అమ్మాయి కళ్ళలో కదులుతున్న భయాన్ని చూసి నవ్వుతూ ముందుకు కదిలాడు చక్రవర్తి

* * *

సౌందర్య మనసును చక్రవర్తి ఆకర్షించటం ప్రారంభించాడు అతను కనపడగానే అతన్ని తలుచుకోగానే ఆమె పెదవులు చిరు నవ్వుతో విచ్చుకునేవి అతని మాటలు చూపులు కవ్వింపు ప్రతి క్షణం గుర్తొచ్చి ఉద్వేగంతో ఊపేసేవామెను

ఆ రోజు

ఇంగ్లీష్ పొయెమ్స్ సరిగ్గా అర్థం కావటల్లేదని చక్రవర్తి ఇంటికెళ్ళింది సౌందర్య ఇంట్లో అతనొక్కడే ఉన్నాడు పొయెమ్ తరువాత చెపుతాగానీ ముందు కొంచెం కాఫీ తాగుదాం అంటూ కిచెన్‌లోకి దారి తీశాడు చక్రవర్తి నేను చెయ్యనా? అంటూ లోపలికెళ్ళి తనే కాఫీ చేసిందామె



"మార్వలెస్ " అన్నాడు చక్రవర్తి

'ఏమిటి?" అన్నదామె

"మీరు "

"ఏమిటీ'?"

"కలిపిన కాఫీ "

ఫక్కున నవ్విందామె

"పాత జోకు అని తీసిపారేస్తారని భయమేస్తోంది-గానీ లేకుంటే ఒంగి ఇప్పుడు రాలిన ముత్యాలు ఏరుకోవాలనుంది " అన్నాడు చక్రవర్తి

ఇంకా ఇలా సౌందర్యను రెచ్చగొడుతుంచనుకున్న ప్రతి ట్రిక్కునూ ప్రయోగిస్తున్నాడతను

అతని మాటలామె మీద ఘాటైన మత్తు పదార్థంలా పని చేస్తున్నాయి

వయసు ఉద్రేకం అతని మీదున్న ఇష్టం నమ్మకం ఏదో తెలియని కుతూహలం అతను తన మీద ప్రదర్శిస్తున్న ఇష్టం ఆరాధన సౌందర్యను ఉక్కిరిబిక్కిరి చెయ్యసాగాయి

భయంతో, సిగ్గుతో వాలిపోతున్న ఆమె కళ్ళు చక్రవర్తిని రెచ్చగొడుతున్నాయి

తన పెదవులతో ఆమె పెదవుల్ని స్పృశించాడతను

ఉద్వేగంతో కంపించిపోతోందామె ఆమె ప్రతి కదలికను గమనిస్తూ నడుం మీద మెడ కింద ముద్దు పెట్టుకుంటూ ఆమె స్పందనలను స్వంతం చేసుకుంటున్నాడు చక్రవర్తి

ఆమె మనసు పూర్తిగా కంట్రోల్ తప్పిపోయింది

* * *

ఆ తరువాత చక్రవర్తి అనే నాలుగక్షరాలు సౌందర్యకు ఎంతో ప్రియమైనవిగా జీవితంలో ఒక భాగంగా అనిపించేవి అతని ప్రతి చర్యా డిగ్నిఫైడ్-గానే కనిపించేదామెకు

"ప్రేమ వేరు. కోరిక వేరు చాలామందికీ తేడా తెలీదు మగవాడు తనలో రగిలే కోరికలకు 'ప్రేమ' అని పేరు పెట్టి ఆడదాన్ని మోసగిస్తూ ఉంటాడు

కోరిక ఒక్కసారితో తన ప్రయోజనాన్ని కోల్పోతుంది అందుకే 'మగాడు తన నరాల బలహీనత తీరిపోగానే ఆడదాన్ని ఎంగిలాకులా విసిరి కొడతాడు

## ప్రేమకు కత్తిపోటు!

ఆడది కోరికకన్నా ప్రేమకు ఎక్కువ ప్రాధాన్యత-నిస్తుంది 'ప్రేమ' అనేది, కాలం గడుస్తున్నకొద్దీ బలపడుతుందేగానీ కోరికలాగా, వెల్లువలా పొంగి, వెంటనే నసించిపోదు

ఆడ మగా మధ్య ఆలోచనల్లో ఉన్న ఈ 'గ్యాప్' అనేక ట్రాజెడీలకు కారణమవుతోంది

సౌందర్యా చక్రవర్తుల విషయంలో సరిగ్గా ఇదే జరిగింది అతనికి పెళ్ళయిందని తెలిసి ఆమె ఏడిచింది ఇంత మోసం ఎందుకు చేశావని నిలదీసింది

"నేనేం మోసం చేశాను? పెళ్ళయిందా అని నువ్వడగలేదు నేనుచెప్పలేదు " కూల్‌గా అన్నాడు చక్రవర్తి

'మిమ్మల్ని పెళ్ళి చేసుకుందామని నేను ముందే అడగలేదూ? ఉక్రోషంగా అన్నది సౌందర్య

అయితే?"

"అప్పుడయినా మీరీ సంగతి చెప్పాలిగా?"

నువ్వడగందే ఎందుకు చెప్పాలి?

అతని లాజిక్ చూస్తుంటే భగ్గుమంటోందామెకు కానీ ఆమె అతన్నేం చెయ్యగలదు? అతని దృష్టిలో "ఆఫ్టాల్ ఒక ఆడది!

ఒకప్పుడు సౌందర్య మీద నుంచి వచ్చే గాలిని కూడా అత్యధికంగా ప్రేమించిన చక్రవర్తికిప్పుడామె ఉనికిని కూడ భరించడం కష్టంగా ఉంది ఆమె కన్నీళ్ళు విసుగును, కోపాన్ని కలిగిస్తున్నాయి ఆమెను తలుచుకోటమే అసహ్యంగా ఉంది సౌందర్య మూర్ఖురాలు కాదు అతని అనుభూతులన్నీ ఆమెకు బాగానే అర్థమవుతున్నాయి చక్రవర్తి తన మీద పెంచుకుంటున్న అకారణమైన ద్వేషం తాలూకు సెగలు తనను చుట్టుముడుతూనే ఉన్నాయి

తన పరోక్షంలో అతను తన మీద చేస్తున్న అశ్లీలమైన కామెంట్స్ ఏమాత్రం వీలున్నా తను అణగదొక్కటానికి అతను చేసే ప్రయత్నాలు ఇవన్నీ ధైర్యంగా ఎదుర్కొంది సౌందర్య

అందరు ఆడపిల్లల్లా అతన్ని పదే పదే ప్రాధేయ-పడటం, వెర్రి మొహంలా ఆత్మహత్యకుతల పడటం హేయంగా అనిపించిందామెక్కు

సౌందర్యలోగల మార్దవమైన స్త్రీ హృదయాన్ని మొదటిసారిగా గొంతు నొక్కి చంపాడు చక్రవర్తి ఆమెను పాషాణంగా మార్చిన ఘనత అతనిదే

ఇప్పుడామెకు మగాడంటే ఎలర్జీ అతను పల్లించే ప్రేమ పారాలంటే అసహ్యం అతనెలాంటి వాడైనా కానీ నిన్ను ప్రేమిస్తున్నాను సౌందర్యా అంటే మాత్రం ఆమెకు నవ్వుతో పొలమారుతుంది ఆ నవ్వులో నుంచే తన్నుకొస్తుంది అసహ్యం, ద్వేషం

అమ్మా ఇదిగో టీ, ఇహ నే వెళ్ళనా? పని పిల్ల మాటలతో ఆలోచన నుంచి గతంలో నుంచి బయట పడి కప్పు అందుకుని వెళ్ళు" అన్నది సౌందర్య

ఈ రోజు జయాకర్ మూలాన మళ్ళీ గుర్తొచ్చాడు చక్రవర్తి జయాకర్ కళ్ళలో తనంటే అభిమానం ఇష్టం పెనవేసుకుని ఉంటాయి చక్రవర్తి కళ్ళు కూడా అప్పుడు అలాగే ఉండేవి మగాడికున్న గొప్ప ఆర్ట్సులలో ఇదొకటి!

* * *

మీరు నన్ను పెళ్ళి చేసుకోకపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాను " అంటూ జయాకర్ రాసిన ఉత్తరాన్ని కూడా కేర్ చెయ్యలేదు సౌందర్య

'మీరంటే నాకిష్టం లేదు " అని నిర్మొహమాటంగా చెప్పేసింది అప్పుడు అతని కళ్ళలో దీనంగా కదిలిన భావావేశాన్ని, వ్యధని చూడగలిగేంత ససున్నితత్వం ఆమెలో ఎప్పుడో నశించి, పోయింది

జయాకర్ తల్లి పెద్ద పెట్టున ఏడవటం చూసి, వాళ్ళింటికి పరుగెత్తింది సౌందర్య

మృత్యువుకు అతి సమీపంలో ఉన్న జయాకర్‌ని చూసి విచలితురాలయిందామె అతని తల్లి





# ఎన్టైస్®

## మి జీవితాలను వెలిగిస్తుంది

డ్రెస్‌మెటీరియెల్
పాలియెస్టర్,
పాలియెస్టర్ బ్లెండ్
మరియు కాటన్

**ఎన్టైస్®**

మంచి అభిరుచి. తగిన ధరలు.

నాషనల్ టెక్స్టైల్ కార్పొరేషన్; (తమిళనాడు మరియు పాండిచెరి) లి
భారత సర్కారపు ఒక ఉద్యోగ సంస్థ
10 64 సోమసుందరం మిల్స్ రోడు. కోయమత్తూరు 641009

ఇండెంటింగ్ ఏజెంట్లు :- ఆంధ్రప్రదేశ్ : బాలాజీ టెక్స్‌టైల్ ఏజన్సీస్, 3-4-394, టొబాకో బజార్, సికిందరాబాద్ 500 003, స్టాక్-కం-సేల్స్ డిపో : ఆర్. పి. డిస్ట్రిబ్యూటర్స్. 3-4-394 టొబాకోబజార్, సికిందరాబాద్ 500 003.

**సీరియల్**

# కాగితపు పడవలు

**యర్రగుంట్ల వరలక్ష్మిదేవి**

(గత సంచిక తరువాయి)

ట్రైయిను ఎక్కిం తరువాత జయలక్ష్మి ఉత్సాహంగానే ఉంది తను తన భర్తతో విడిగ యాత్రకు వెళ్తూంది తను ఓ ఇల్లాలయింది అందరిలా తను మంచినీళ్ళు కావాలి, కాఫీ కావాలి, టిఫిను కావాలి' అని భర్తకు చెప్పి అతను తెచ్చిస్తే తీసుకుంటుండాలి అదో ఆనందం తన భర్త కసురుకోడు చాల నెమ్మదస్తుడు, మంచివాడు ఎంతో ప్రేమతో భర్తవైపు చూచింది ఇంతలో ఎదురుసీట్లో కూర్చున్న ఒకావిడ జయలక్ష్మిని ప్రశ్నించింది

"ఏమమ్మా ఎక్కడికెళ్తున్నారు "

"తిరుపతికండి – మరి మీరు?"

"విజయవాడకు – అతను మీవారా? '

"అవునండి "

"యాత్రకు వెళ్తున్నారా?"

"అవునండి పెండ్లకాగానే దైవదర్శనం చేసుకుందామని "

"ఆ–నేను మొదటే అనుకున్నాను– కొత్తదంపతలని '

ఇంతలో రామారావు ఫ్లాస్కులో కాఫీ, క్రీము బిస్కట్ల పాకెట్టు, పండ్లు కొని తెచ్చేడు జయలక్ష్మికి హక్కుగ మొగుడ్ని మందలించాలని బుద్ధి పుట్టింది

ఇవన్ని ఎందుకండి– చిన్నపిల్లల్లా బండిఎక్కిందగ్గర్నుండి తింటూ కూర్చుంటామా?'

మళ్ళీ అండీలోకి దిగిందేమోనని రామారావు ఆశ్చర్యపోయినా వెంటనే ఆ కండ్లలోని చిలిపితనం గ్రహించి, ఆఎదురుగ కూర్చున్న ఇల్లాల్ని చూచి ఊరుకున్నాడు

జయా! ఆఫ్లాస్కులోని కాఫీ త్రాగు , అని ప్రేమతో చెప్పేడు

జయలక్ష్మి గర్వంతో ఎదురుగా ఉన్న వాళ్ళని చూసి– "మీరు కాస్త త్రాగండి , అని బుట్టలోని గ్లాసులను తీసింది

భర్తను 'మీరు' అనడం 'ఏమండి' అనడంలో జయలక్ష్మి సాంప్రదాయ-పరమైన మనస్సుకి ఉల్లాసం కల్గింది ఆ బోదనే సముచితంగా తోచింది

జరిగిన కథ-16 : సుబ్బారావు సుభద్రల పెళ్ళి జరిగిపోయింది. జయలక్ష్మి తమ్ముడికి ఉద్యోగం వచ్చింది. కటుంబరావు జయలక్ష్మి పెళ్ళి జరిపించను అంగీకరిస్తాడు. ఆ శుభవార్తను రామారావుకి చెప్పింది జయలక్ష్మి. వారి పెళ్ళి నిశ్చయమైంది. వానలో తడిసిన జయ దగ్గడం ప్రారంభించింది. మరునాడు ఆఫీసుకు రాకపోతే రామారావు కంగారు పడిపోతాడు. జయలక్ష్మికి గుండె-పోటు వచ్చింది. డాక్టరు అన్ని టెస్టులు చేసి వ్యాధిని గురించి రామారావుకి చెప్పి కొన్ని మందులు రాసిచ్చి వాడమన్నారు. పెండ్లి ముహూర్తం ఇంకా పదిహేను రోజులుంది అనగా జయలక్ష్మిని బలవంతం చేసి సింహాచలంలో గుడిలో పెళ్ళి చేసుకొంటాడు రామారావు. జయలక్ష్మి తన ఆరోగ్యం విషయంలో కంగారు పడితే హార్టులో కొద్దిగా కొవ్వు చేరిందని మందులు వాడితే తగ్గిపోతుందని ధైర్యం చెపుతాడు. వారిద్దరు తిరుపతి వెళ్ళి అక్కడ నుంచి హనిమూన్ వెళ్ళి రావాలని ప్లాను వేసుకొంటారు.

. తిరుపతి చేరిం తరువాత రామారావు భార్యను మందలించేడు ఏమిటోయ్! మళ్ళీ నాయనమ్మలా ఏమండీ, మీరు అని మొదలెట్టేవు?"

'అలా పిలవకపోతే ఇదేదో లేచిపోయే బాపతు అనుకుంటారు మనల్ని గౌరవంగా చూడరు చూడండి త్రోవలో ఎదురుపడ్డ ఇల్లాళ్ళు ఎలా నన్ను నవ వధువుకు ఇవ్వవల్సిన ఆదరణ, గౌరవం ఇచ్చేరో! అందుకే మనం ఈ యాత్ర-నుండి తిరిగి వచ్చేవరకు అలా పిలవనివ్వండి, మీ అమ్మగారు కూడ నా వైపు కోపంగా చూచేరు నేను నిన్ను 'నువ్వు – రామూ' అనగానే అందుచేత మనం విశాఖలో విడిగ కాపురం పెట్టేవరకు మా అత్తవారింట్లోని నిన్ను మీరు అనే సంబోధిస్తాను మా ఇంట్లో ఫరవాలేదు మా అక్కయ్య స్పోర్టివ్‌గా తీసు-కుంటుంది మా నాన్నకు ఏ గొడవ అఖ్ఖర్లేదు "

. "అందుకే అంటారు పెండ్లయిన ఆడది మారిపోతుందని

'నాలో ఏ మార్పు లేదు– నాకు నువ్వెప్పుడూ రామారావే– సరేనా '

తిరుమలలో కోవిలకు చేరువలోనే ఉన్న ఓ కాటేజి తీసుకున్నారు స్నానం చేసి, శుభ్రమైన బట్టలు వేసుకుని కోవిలకు బయలుదేరుతుంటే జయలక్ష్మి గుండెలో చిన్న నొప్పి వచ్చింది ఆమెను మంచం మీద కాసేపు పడుకోమన్నాడు

"నేను వెళ్ళి డాక్టరును పిలుచుకునివస్తాను

వద్దు రాము! చాల చిన్న నొప్పే అదే సర్దుకుంటుంది

అన్నట్టు నీకిచ్చిన మాత్రలేవి అందులోని ట్రయాక్టిన్ మాత్ర నొప్పి వచ్చినపుడు వేసుకోమన్నాడు డాక్టరు "

నా పెట్లో ఉంటుంది చూడు '

రామారావు చూచేడు– ఎక్కడుంచేవు మాత్రలు

కుడి ప్రక్క రవికల క్రింద ఆ మూలకు ఉంచేను చూడు

రామారావు కొంత వెదికిన తరువాత ఆ మాత్రలు దొరికాయి అందులో ట్రయాక్టిన్ తీసి మంచినీళ్లతో జయకు ఇచ్చేడు ఆమె మాత్ర వేసుకున్న తరువాత మిగిలిన మాత్రలు ఆమె పెట్టెలో పెడుతుంటె–

రాము! ఆమాత్రలు ని పెట్టెలోనే ఉంచు కావల్సినపుడు ఇచ్చువుగాని నా పెట్టెలో బట్టలతో కలిసిపోయి నేనే వెతుక్కోవల్సి వస్తూంది

అయితే చూడు నా పెట్టెలో మూత తెరవగానే ఇక్కడ ఉన్న ఈ పాకెట్‌లో ఉంచుతున్నా నేను ఫ్లాస్కు తీసుకునివెళ్ళి వేడి కాఫి తిసుకొస్తా

కాఫి తెచ్చాక ఇద్దరు కాఫి త్రాగేరు పదిహేను నిముషాలు విశ్రాంతి తీసుకున్న తరువాత జయలక్ష్మి లేచింది

పద కోవిలకు వెళ్దాం– నొప్పి తగ్గిపోయింది అవును మళ్ళీ నొప్పి వచ్చిందేం?మందులు ఆ నాటి నుంచి తింటున్నానే

'మరేంలేదు– రైలులో ప్రయాణం చేసేం కదా ప్రయాణపు బడలికవల్ల వచ్చింది దాని గురించి పెద్దగా ఆలోచించకు

"రాము! ఆఖరికి నేను రెగ్యులర్ పేషెంట్‌ని అయిపోతున్నానే

చీ ఏమిటామాటలు! పద దైవ దర్శనం చేసుకుంటే అన్ని చిడలు పోతాయి

ఇద్దరు ఉత్సాహంగా కోవిల దరికి వెళ్ళేరు అక్కడ ఆ పెద్ద క్యూ చూసేసరికి జంకు కలిగింది ఇద్దరికి రామారావు స్పెషల్ దర్శనంకు టిక్కెట్టు తీసుకుని చిన్న క్యూలో నించుని అరగంట తరువాత దర్శనం చేసుకుని వచ్చేరు

బయట ఎటువంటి ఆలోచనలున్న ఆ మహాదైవాన్ని దర్శించేసరికి మానవుల్లో అల్పత్వం దేమునిలోని మహోన్నత్యం, మహాశక్తి అన్నింటికన్నా ముఖ్యంగ మానవులందర్ని కష్టాలలో ఆదుకునే దైవం, కరుణాత్ముడైన ఆ వెంకటేశ్వరున్నాడని తెలివొస్తుంది కన్నులపండువుగ ఆ మహాదర్శనం చేసుకుని ఇద్దరు తిరిగి-వచ్చారు

ఆ రాత్రి మరి భోజనం చేయడానికిష్టంలేక పండ్లు పాలు తెచ్చుకున్నారు

'జయా! దేముణ్ని ఏమి కోరుకున్నావు?

ముందు నువ్వేమి కోరుకున్నావో చెప్పు– అప్పుడే నే చెప్తా

"పోనీ ఒకలా చేద్దాం– ఇద్దరం కాగితాల మీద వ్రాసి, కాగితాలు మార్చుకుని చదువుదాం– ఏం "

సరే"

అలా కాగితాల మీద వ్రాసింతరువాత జయలక్ష్మి రామారావు కాగితాన్ని చదివింది

"భగవంతుడా! నా జయకు ఆయువు, ఆరోగ్యం ఇచ్చి కాపాడు తండ్రి" జయలక్ష్మి కండ్లకు నీటి పొరకమ్మగ ఆరాధనతో రామారావుని చూసింది.

'దేముడా! మా ఇరువురి ప్రేమ ఎల్లకాలం యిలాగే ఉండేటట్లు చూడు మా సంసారంలో ఎటువంటి ఒడిదుడుకులు రాకుండ చూడు," అని జయలక్ష్మి వ్రాసింది

ఆ రాత్రి ఇరువురు ప్రక్క ప్రక్క మంచాలమీద పడుకున్నారు. ఎవరి ఆలోచనలు వారివి ఆఖరికి జయలక్ష్మి మరి ఉండబట్టలేక మాట్లాడింది.

"రాము! మనల్ని ఎవరైన ఇప్పుడు చూస్తె కొత్తగా పెళ్లయిన దంపతులనుకోలేరు కదూ?'

ఆమె స్వరంలోని బాధను రామారావు గ్రహించాడు అతడి మనస్సు ఆమెయెందు కరుణతో నిండిపోయింది

'జయా! ఇలా దగ్గరగరా, అని ప్రేమతో పిలిచేడు

జయ ఆనందంతో చేరువగా వచ్చి తలను రామారావు గుండె మీద ఆన్ని అతడి మీదుగ చెయ్యి వేసి పడుక్కుంది

"నామీద నీకేమి కోపం లేదుకదూ రామూ?"

'ఎంత మాట జయా! నువ్వంటే నాకు ప్రాణంతో సమానమని నీకు తెలియదూ?"

"మరి నన్ను దూరంగ ఎందుకుంచుతున్నావు చెప్పు?"

"జయా! ఇది దేవుని స్థలం– ఇక్కడ అట్లాంటి అపచారాలు చేయకూడదు"

"మరి ఈ క్షేత్రంలో కాపురాలు చేస్తున్నవారు పిల్లల్ని పాపల్ని కనడంలేదు?'

"వాళ్ల సంగతి వేరు మనం యాత్రికులం మనకా హక్కులేదు' కాస్సేపయాక రామారావే చెప్పేడు

"జయా! రేపుకూడ ఇక్కడ ఉండి–మళ్లీ దేముడి దర్శనం చేసుకుని వెళ్లుండి కట్పాడి వెళ్దాం"

"కట్పాడి ఎందుకు?"

"నా స్నేహితుడొకడు టెలిఫోను ఆపరేటరు అక్కడ ఉన్నాడు.వాడింటికి వెళ్లి అక్కడ నుండి బెంగుళూరు వెళ్దాం బెంగుళూరు నుండి హైదరాబాదు వచ్చి అక్కడ నుండి మనింటికి తిరిగివద్దాం."

అలా ఏవేవో మాట్లాడుకుంటూనే ఇద్దరు నిద్రపోయారు

ఆ మరునాడు ప్రొద్దున్న దైవ దర్శనం చేసుకుని అలా బజారు చూసుకుని భోజనం చేసి కాటేజికి తిరిగివచ్చారు కాస్సేపు మాట్లాడుకుని పడుక్కున్నారు

నిద్రలేచేసరికి మధ్యాహ్నం మూడు గంటలయింది కాఫీ తీసుకునిరావడానికి ఫ్లాస్కు తీసుకుని హోటలుకి బయలుదేరాడు రామారావు

జయలక్ష్మి లేచి ముఖం కడుక్కుందామనుకుంది గుండెలో మళ్లీ నొప్పి వచ్చింది జయలక్ష్మికి బాధతోపాటు, సిగ్గు, భయంకూడా కల్గేయి ఏమిటిలా మాటిమాటికి నొప్పి వస్తుంది? తనిలా పేషెంటు అయిపోయేనని తెలుస్తే రామారావు ఏమనుకుంటాడు? చెంగున లేడిలా గెంతుతూ భర్తతో తిరగవలసిన వయసులో ఏమిటీ వ్యాధి– తనని తరుముతూంది?

రామారావు వచ్చేలోగా తను ఆ ట్రయాక్టిన్ మాత్ర వేసుకుని బాధనివారణ చేసుకోవాలని అనుకుంది జయలక్ష్మి ఆ మాత్రలు రామారావు పెట్టిలో ఉన్నాయి జయలక్ష్మి రామారావు పెట్టి తెరచింది మాత్రలు తీసింది అప్పుడు చూచింది పెట్టిలో ఒక ప్రక్కన ఎక్సరే ఫోటోలను మాత్ర వేసుకుని ఆ ఫోటోల పెద్ద కవరుని తీసింది. ఆ ఫోటోలతో డాక్టర్ల రిపోర్టులున్నాయి డాక్టరు వ్రాసి యిచ్చిన మందుల చీటీ ఉంది రామారావు డాక్టర్ని కనుక్కున్నానన్న రోజుకి నాల్గు రోజుల ముందరే డాక్టరు ఆ రిపోర్టుని వ్రాసిచ్చేడు ఆ మందుల చీటీకూడా ఆ తారీకుదే. జయలక్ష్మి ఆశ్చర్యపోయింది రామారావు అబద్ధమాడినందుకు వణుకుతున్న చేతులతో ఆ రిపోర్టుని తీసి చదివింది. వీధి తలుపు గడియపెట్టివచ్చి రిపోర్టునంతా చదివి భయంతో వణకనారంభించింది కొద్ది నిముషాలకు వీధి తలుపును రామారావు వచ్చి తట్టాడు జయలక్ష్మి ఆ ఫోటోలను ఆ రిపోర్టును కవరులోపెట్టేసి, కవరును పెట్టిలో పెట్టేసి వెళ్లి తలుపు తీసింది.

రామారావు లోనికి వచ్చి కాఫీని గ్లాసులో పోసి జయకు ఇచ్చాడు. తను మరో గ్లాసులో మిగిలిన కాఫీ పోసుకుని కాఫీ త్రాగింతరువాత జయలక్ష్మి మౌనంగ ఉండడం, ఆ ముఖంలో విచారం గమనించేడు రామారావు

'ఏం జయా! అలా ఉన్నావు?"



# కాగితపు పడవలు

జయలక్ష్మి జవాబు చెప్పలేదు వెంటనే. కొన్ని సెకండ్లు ఏదో ఆలోచించి అడిగింది– "రాముూ! కట్పాడికి రాయవెల్లూరు ఎంత దూరం?"

రామారావు నిర్ఘాంతపోయాడు.

**"రాయవెల్లూరు కట్పాడికి నాల్గుమైళ్ళలో ఉంది. కట్పాడినుండి బస్సులో వెళ్లాలి!"**

జయలక్ష్మి తీక్షణంగ రామారావు ముఖంలోకి చూస్తూ అడిగింది..

"మనం యిప్పుడు వెళ్తున్నది రాయవెల్లూరికిగాని కట్పాడికి కాదు కదూ?" రామారావు చటుక్కున తనపెట్టె వైపు చూచేడు. తన పెట్టె తెరిచి ఉంది.

"జయా! ఆ డాక్టరు రిపోర్ట్సు చదివేవా?" చాల కరుణతో అడిగేడు.

"చదివేను కనుకే నువ్వు ఆడిన అబద్ధాలు నా కిప్పుడు తెల్సివచ్చేయి. నాకు హార్టులో కాన్సరు అని తెల్సి కూడ నేను ఎక్కువకాలం బ్రతకనని తెల్సి నన్ను ఎందుకు పెండ్లి చేసుకున్నావు – చెప్పు?"

"డాక్టర్లు ఒక్కొక్కప్పుడు పొరబడుతుంటారు."

"నన్నింకా ఎందుకు మభ్యపెడతావు రాము? నువ్వు ఆ డాక్టరు రిపోర్ట్సుని నమ్మబట్టే నన్ను తొందరచేసి, నాకోసం మరి ఆగలేవని చెప్పి కోవిలలో పెండ్లి చేసుకున్నావు. మృత్యువు నాకోసం ఆగదని, ఈ లోగానే నాకు ప్రియమైన భార్యాత్వం కల్గిద్దామని, నువ్వు నాకు భర్తవయేక, ఆ భర్త హక్కుతో నన్ను రాయవెల్లూరు తీసుకుని వెళ్లి పరీక్షలు చేయించుదామని ఇక్కడకు తీసుకుని వచ్చేవు. బహుశా నీకు విశాఖ డాక్టర్లు చెప్పి ఉంటారు – ఈ పేషంటుకి ఎటువంటి ఉద్రేకం పనికిరాదు – ముఖ్యంగ దాంపత్య జీవనం – అందుకే ఏవేవో సాకులు చెప్పి నన్ను తాకకుండ దూరంగ ఉంచుతున్నావు." అని ఆవేశంతో అంది.

రామారావుకు ఆమె దుస్థితికి ఎంతో జాలి కల్గింది. రామారావు కండ్ల వెంట నీరు కారజొచ్చింది. ఆమెను ఊరట పరచేందుకు చేతులు జాచేడు. జయలక్ష్మి మరి నిబ్బరించుకోలేక పోయింది. ఆమె కన్నీరు గట్టు తెగిన వాగులా ప్రవహించింది. అలా యేడుస్తూ రామారావు చేతుల్లో వాలిపోయింది.

"ఎందుకయ్యా నీకు నామీద అంతకరుణ? నీ ఋణం నేనెలా తీర్చుకోగల ననుకున్నావు? ఈ జీవత్ శవంవల్ల నీకేమి ప్రయోజనం చెప్పు? డాక్టరు నేనెల్లాళ్ళలో చనిపోతానని చెప్పేడు కదూ?"

ఈ మారు రామారావుకి నిజంగ కోపం వచ్చింది.

"ఏమిటలా అవివేకంగ మాట్లాడుతున్నావు? మనం రేపు రాయవెల్లూరు వెళ్దాం. అక్కడ మంచి ఎక్సపర్ట్సులున్నారు. పేరు బడ్డ ఆసుపత్రి. అక్కడ డాక్టర్లు ఈ వ్యాధి నిర్ధారణ ఏమని చేస్తారో చూద్దాం. ఆ తరువాతే ఏం బెంగపడాలో పడదాం. అంతలోనే భయపడిపోయి ఉత్సాహంగ గడచిపోతున్న బ్రతుకును హీనం చేసుకోడమెందుకు? నా మాట విను – ఆ విషయమ్మే ఏమి ఆలోచించకు."

ఇప్పుడు తరచుగ వస్తున్న ఈ గుండె నొప్పివల్ల తను ఎక్కువకాలం బ్రతుకుతుందన్న ఆశని పూర్తిగ పోగొట్టుకుంది జయలక్ష్మి.

ఆ మరునాడే రాయవెల్లూరు వెళ్ళేరు. అక్కడ హాస్పిటల్‌లో అన్ని రకాల టెస్టులు చేసేరు. రాయవెల్లూరులో ఓ వారం రోజులున్నారు. రాయవెల్లూర్నించి జయలక్ష్మి తన అక్క కమలమ్మకు ఓ ఉత్తరం వ్రాసింది – తనకు మళ్లీ గుండె నొప్పి వచ్చిందని అక్కడ హాస్పిటల్‌లో పరీక్షలు చేయించుకుంటున్నానని త్వరలోనే తిరిగి వస్తారని.

అన్ని పరీక్షలు అయిం తరువాత రామారావు డాక్టర్ను కలిసేడు.

"మిస్టర్ రామారావు! ఈ కేసు చాల సీరియస్‌ది. హార్టులో అప్పర్ లోబ్‌లో కాన్సరు వ్యాధి కల్గింది. అది ఇప్పుడు అడ్వాన్సుడు స్టేజిలో ఉంది. హార్టు భాగాన్ని ఆపరేషను చేయడం ఎవ్వరికి సాధ్యంకాదు. ఒకవేళ ఆపరేషను జరిగినా మరో భాగానికి కాన్సరు కల్గవచ్చు."

"అయితే పేషంటు మందులు తిని ప్రయోజనంలేదా?"

"మందులు తింటుంటే ఆ బాధ తీవ్రంగ ఉండదు. రాను రాను బాధ మరీ తరచుగాను, విపరీతంగాను వస్తుంది. మృత్యువు దగ్గరపడుతుంటే బాధను తట్టుకోడం కష్టం. అట్లాంటి సమయంలో మార్ఫియా ఇంజక్షను ఇప్పించాలి. ఈ మందులు రెండు పూటలా ఇవ్వండి. కొంత ఉపశమనం కల్గుతుంది."

వణకుతున్న గొంతుకతో రామారావు అడిగేడు –

"మరిడాక్టరుగారు! మీ అంచనా ప్రకారం ఆమె ఎన్నాళ్ళు బ్రతుకుతుంది?"

డాక్టరు మళ్లీ తను వ్రాసిన రిపోర్ట్సులను మరోసారి చదివి, ఆ ఫోటోలను గమనించి – "అంత ఖచ్చితంగ చెప్పలేనుగాని మూడు నెలలకు పైన బ్రతకడం కష్టం. మరో నెల్లాళ్ళకు పూర్తిగ వ్యాధిగ్రస్తురాలై ఇంటినుండి కదలలేని దురవస్థ కల్గుతుంది. ఆఖరినెల్ల పూర్తిగ మంచంనుండి కదలలేని స్థితి వస్తుంది."

ఆ సరికే రామారావుకి కన్నీరు కారజొచ్చింది.

"అయామ్ సారీ! మిస్టర్ నేను ఏ విధంగా ఈ వ్యాధిని ట్రీట్ చేయలేక పోతున్నందుకు చింతిస్తున్నాను."

రామారావు బయకువచ్చి జయలక్ష్మిని కౌగలించుకుని భోరుమని యేడ్చేడు. జయలక్ష్మికి అంతా అర్థమయిపోయింది. హృదయం నీరు కారిపోయేటట్లు యేడ్చింది.

ఇద్దరు కొత్తవలస తిరిగివచ్చిన తరువాత రామారావు మరేమి దాచకుండా

కమలమ్మకు అన్ని వివరంగా చెప్పాడు. కమలమ్మ అంతా విన్నాక రామారావు చేసిన త్యాగానికి, చూపిన ప్రేమకు ఆమె హృదయం కృతజ్ఞతతో ఉప్పొంగింది ఆమె చేతులెత్తి రామారావుకి నమస్కరించింది.

"రామారావుగారు! మీరు దేముడిలాంటివారు," అంది

"వదినగారు! నేను దేముణ్నే అయితే జయకు ఇట్లాంటి వ్యాధి రానిచ్చుందునా— నేను ఏమీ చెయ్యలేని మట్టిబొమ్మనే"

కంటకాపల్లి వెళ్ళిం తరువాత తాము తిరుపతి, హైదరాబాదు తిరిగి-వచ్చేమని చెప్పాడేకాని జయలక్ష్మి రోగాన్ని గురించి ఏమీ చెప్పలేదు

"మరి కోడలుని నీ తో ఇక్కడకు తెచ్చేవుకావేమిరా?" అంది తల్లి

"ప్రయాణ బడలికవల్ల కాస్త జ్వరం వచ్చింది— అందుకే కొత్తవలసలో దింపి వచ్చేను."

"ఈ కాలం పిల్లల్లో సత్తువలేదు. కాస్త తిరిగివస్తే అలసిపోతారు," గొణుక్కుంది తల్లి.

వారం రోజుల్లో డాబాగార్డెన్స్‌లో ఒక పెద్ద ఇల్లు తీసుకున్నాడు రామారావు. అక్కడ కుటుంబరావు కుటుంబాన్నంత మార్చేడు కొడుకుకి విశాఖలో ఉద్యోగం దొరికిందగ్గరనుంచి అతడికాలోచన ఉంది. రామారావు అభ్యర్థనపైన జయలక్ష్మి మరి ఆఫీసుకు పోలేదు. సిక్ లీవు పెట్టి ఉండిపోయింది రామారావు ఆ ఇంట్లో కొంత అద్దె ఇస్తూ భార్యతో ఉంటున్నాడు అందరికీ వంటను కమలమ్మే చేస్తుంది. మరి ఆ డెయిలీ పాసింజరుగా వ్యవహరించలేడని తను తన భార్యతో విశాఖలో కాపురం పెడుతున్నట్లు ఇంట్లో చెప్పేసేడు. తల్లి, తండ్రి గొణుకున్నా చేసేదేమీలేక ఊరుకున్నారు. తరువాత నెల్లాళ్ళకు అందరికి తెలిసిపోయింది జయలక్ష్మి దారుణమైన కాన్సరు వ్యాధితో బాధపడుతూందని అందరూ రామారావు ఎంతో నిర్భాగ్యుడని జాలిపడ్డారు

వారం, వారం ఆశ చావక రామారావు జయలక్ష్మిని కె జి హాస్పిటల్‌కి తీసుకుని వెళ్ళేవాడు. ఆఖరి నెల జయలక్ష్మి మంచం దిగలేని స్థితికి వచ్చింది ఇన్నాళ్ళు ఆమె ఎవ్వరితో మాట్లాడేది కాదు పొడిమాటలు తప్ప ఆ మృత్యువు కోసం యెదురు చూచేది ఒకనాడు రామరావుతో సాయంత్రం ఆ ఇంటి డాబా పైన రామరావు తొడ పైతల పెట్టుకుని పడుక్కుని మాట్లాడింది.

"రామూ! ఒచ్చే జన్మలో కూడ నువ్వే నాకు భర్త కావాలని ఆ దేముణ్ని నిత్యం ప్రార్థిస్తున్నాను. మరో జన్మలో నిన్ను సుఖపెట్టి నా ఋణం తీర్చుకుంటాను ఈ జన్మలో నువ్వు నాకు అన్ని సేవలు చేసేవు మనం జీవితంలో ఎన్నో ఆశలు పెంచుకొంటాము. ఈమధ్య తరగతి జీవితాలలో అన్ని ఇబ్బందులు తొలగి వివాహ జీవితంలో శాంతిని పొందుదామనుకుంటాం—గాని నాలాంటి అభాగినులకు మరణంతోనే శాంతి చేకూరాలి. రామూ! నేనెన్నడు నిన్నేమి కోరలేదు— ఓ కోరిక కోరాలనుంది."

"చెప్పు జయా! నా ప్రాణాలు కావాలన్నా ఇస్తాను"

"రామూ! నాకు చావాలని లేదు—నన్ను బ్రతికించి ఉంచవూ"

"నేనెంత అభాగ్యుణ్ని—జయా!"

అని యేడవడం మొదలెట్టేడు రామారావు.హృదయాంతరాళం నుండి వెలువడుతున్న అతడి రోదన ధ్వనిలో, ఆమె ఆఖరి నిస్వాసపు సవ్వడి కలసి-పోయింది

ఆ హృదయ విదారక దృశ్యం చూచి గగన తారలు కన్నులు చెమర్చగ రెప్పలను మిణుకుమని అల్లార్చాయి

**(అయి పోయింది)**

# టికెట్

కుమారి రాగతి పండరి


















# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

### జి. జి. నంద్యాల

నిజం చెప్పండి. జీవితంలో మీ రెప్పుడూ నిరాశ నిస్పృహలకి లోను కాలేదా? జీవితంపై విరక్తి కల్గలేదా?

★ మనిషై పుట్టిన ఎవరికైనా – యిలాంటివి ఎప్పుడో కల్గుతూనే వుంటాయి గీతా, కాని నేను నిరాశ నన్ను కృంగతీయకుండా, నిస్పృహ లొంగతీసుకో-కుండా ఉండడానికి – అనేక రకాల వ్యాపకాలలో వుండడానికి ప్రయత్నిస్తాను. విరక్తి అంటావా? విరక్తి "చావాలని" కాదు? బ్రతుకు మీద కాదు: కోరికల మీద కల్గింది నాకు. నాకేం పెద్ద కోరికలు లేవు. బాధ్యతలు తీర్చేసుకోవాలి అన్న తపన తప్ప.

### పి. జి. వి. తాళ్లగోకవరం

సృష్టిలో అతి తీయనిది స్నేహం అంటారు అతి చేదుది?

★ వికటించిన స్నేహం!

### వి. ఎస్. ఎస్. ఆర్-గుంటూరు.

నేను పత్రికలో చూసేది మొదట సమాధానాలే. అంత సూటిగానూ నిజజీవితంలో వుంటున్నారని నానమ్మకం.

★ ఉంటున్నాను. (అప్పుడప్పుడు అవసరార్ధం ఎవరినీ నొప్పించని చిన్న చిన్న అబద్ధాలు ఆడక తప్పదు. అది చేస్తూంటాను 'చీరబాగుందా? అంటే చక్కగావుంది' అంటాను – గాని" చీరబాగుంది నీకు బాగులేదు"– అనలేను!

### జి. ఎస్.-కర్నూలు.

కుటుంబీకునితో స్నేహంగాని, చనువుగాని పెంచుకొనుట ప్రమాదం అంటారు. మరి అవివాహితతో వివాహితుడైనవాడు స్నేహము పెంచుకోవడం నమ్మదగినదేనా?

★ ఒకే విషయం అటునుంచి యిటూ ఇటునుంచి అటూ అడుగుతున్నావు సోదరీ. .... పెళ్లయిన వాడైనాకానివాడైనా మగాడికేం బాధలేదు– హాయిగా స్నేహం చేయకలడు. చనువూ ప్రదర్శించ కలడు. ఆడదాని విషయంలో–యిది వేరు పెళ్లయిన వాడిని ప్రేమించడానికి ఎన్నో 'సజావైన' కారణాలే కనబడవచ్చును. అయినా కూడా ఆడదాని అంత-రాత్మ 'చేస్తూన్న పని' తప్పు అని నిలదీస్తూనే వుంటుంది తప్పు పని చేయడంలో సుఖం ఏది? శాంతి ఏది?

### ఎమ్.ఎస్.పి. విజయవాడ

మీరు నేను 'పురుష ద్వేషిని' కాను అనడం, ఎన్ టి.ఆర్. అసలు తాను కేంద్రంతో ఘర్షణ పడలేదు అన్నట్టుగా వుంది

★ మీరు బోడిగుండుకీ మోకాటికీ ముడి వేయాలనిచూస్తున్నారు! రాజకీయాల్లో ఏమన్నా చెల్లుతుంది. నిజజీవితంలో కుదరదు.నేను పురుషద్వేషిని కాను. పోనీ కొన్ని రకాల పురుషద్వేషిని అనుకోండి. అన్నివిధాలా ఆడది తమకంటే తక్కువ జాతి జీవి అనుకునే పురుషులంటే–నిజంగానే నాకు అసహ్యం.

### ఎమ్. కె. ఆర్. అక్కుపల్లి

భూమికి ఆకర్షణ శక్తి వుందంటారు. ఇపుడు ధరలు ఆకాశాన్ని అంటుతున్నాయి.మరి భూమి ఆకర్షించదేం?

★ విభిన్న కోణాల ప్రసరించే ఏ శక్తి అయినా క్షీణించిపోతుంది. ఈ విషయంలో ఏకత్వం వుండి వుంటే తప్పకుండా ధరలను నేలకి దింపే శక్తి జనానికి వుంది.

### ఎస్. ఏ. కె. మదనపల్లి

ఈ మూఢనమ్మకాలు నిజమేనా? అయితే తలుపులు కదిలిస్తే కొట్లాటలు జరుగుతా-యంటారు.దీనిపై మీసలహా.

★ తలుపులు కదిలించకండి. కొట్లాట అంటే భయం అన్నప్పుడు. కొట్లాట జరిగినా జరక్క-పోయినా తలుపు యిరుసులకి ముప్పని అలా అంటారు.

### ఎన్.ఎస్.ఆర్. కడప.

మంచి- అంటే ఎదుటివాడు చెడు అంటాడు.

★ అది లోకరీతి

మనిషికి ఎన్ని సుఖాలు వున్నా తృప్తి అనేది కనబడడం లేదు. ఎందుచేత?

★ సుఖాల్లో తృప్తి ఎక్కడుంది! అసంతృప్తే ఎప్పటికపుడు మిగిలిపోతూ వుంటుంది

ఎంత మంచిగా వున్నా మగవాడి దగ్గర మంచి అనిపించుకోలేదు. ఏమిటి?

★ మగవాడిచేత మంచి అనిపించుకోవడం కోసమే మంచిగా వుండక్కరలేదు. స్వీయ శీల సంపద కూడా చాలా ముఖ్యం.

మీ ప్రశ్నవళి ఎన్నిసార్లు చదివినా నా మనసుకు చాలా ఆనందంగా వుంటుంది

★ సంతోషం. చాలా మందికి ఒంటికి కారం రాసుకున్నట్టుంటుందని తిడుతున్నారు!!

### ఐ.కె. ఎస్.-వరంగల్.

యువతి యువకుడు ప్రేమించు కుంటున్నారంటే శారీరక వాంఛ కోసమా? లేక ప్రేమకోసమా? శారీరక వాంఛకోసమే అయితే ప్రేమను ప్రేమకోసం ప్రేమించలేరా?

★ ప్రేమ–లో వాంఛవుంది. ఆరాధనవుంది. ఆరాధన ప్రేమ భక్తితో సాధ్యం వాంఛతో కూడినది మనుషులకు సహజం. అంత మాత్రంచేత ప్రేమించ-గానే– సెక్సు కోసమే అనుకోనక్కరలేదు.

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్లలో వుండాలి...



ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్‌లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్ఫరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్ఫరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం

# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రొటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు. మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే. అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సీరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది. ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు.

మీ పాపకి చనుపాలే తగినవి. అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

## సిరిలాక్®
## పాలు వుండనే వున్నాయి




**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల ఛార్ట్
ఇందులో బరువు ఛార్టు, రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి.
సిరిలాక్
పోస్ట్ బాక్స్ నం 3 న్యూ ఢిల్లీ-110 008.

SAA/FSL/C/3151 TEL

NESTLE.



రాయదుర్గంలో పాదరస లింగం

# పాదరస లింగం ప్రతిష్ఠ

సామాన్యంగా మీరు ఎన్నో ఆలయాల్లో శివ లింగాలను చూచి యుంటారు ఉప్పలింగాలను కూడా చూచి యుంటారు అయితే పాదరసలింగాన్ని ఎప్పుడైన మీరు చూచి యున్నారా? పాదరసాన్ని ఘనరూపంలో చూడలేము కదా! కాని నేడు ఆస్తికు లందరూ పాదరసలింగాన్ని ఆంధ్రదేశంలోని అనంతపురం జిల్లా రాయదుర్గం పట్టణంలోగల శ్రీ రాజ విద్యాశ్రమములో పాదరసలింగాన్ని సందర్శించ వచ్చును

దర్శనాద్రసరాజస్య గవాంహత్యాం వ్యపోహతి
స్పర్శనాన్నాశయాద్దేవి బ్రహ్మ హత్యాంన సంశయః

ఈ రసరాజాన్ని (పాదరస లింగమును) దర్శనము చేసుకొన్న యెడల గోహత్యా పాపము తొలగును ఈ రసరాజమును స్పర్శించిన యెడల నిస్సందేహముగా బ్రహ్మహత్యా పాపము నివారింపబడునని పరమేశ్వరుడు పార్వతికి తెలిపియున్నాడని పెద్దలు చెబుతుంటారు.

ఖనిజములలో కెల్లా పాదరసం విచిత్రమైంది కదా! పూర్వం రసవాద విద్య నేర్చినవారు ఈ విద్యతో పాదరసాన్ని ఘనీభవింప జేసి బంగారం తయారుచేసేవారట. ఇలాగే వేమన రసవాద విద్య నేర్చుకొని బంగారం తయారుచేయడానికి కృషి చేసి విఫలుడై వైరాగి అయ్యాడని కొందరు చెబుతుంటారు

పాదరస లింగాన్ని ప్రప్రథమంగా మద్రాస్, రంగరాజపురానికి చెందిన శ్రీయస్ ఆర్ ఆర్ శర్మగారు 27 సెం. మీ. ఎత్తు గల శివలింగాన్ని 11 ఫిబ్రవరి 1983లో తయారు చేసి యున్నట్లు పత్రికల ద్వారా తెలిసింది.

శ్రీ రాజవిద్యాశ్రమ అధ్యక్షులు శ్రీ ఆ జీవముక్త స్వాములు మరియు కమిటీ మెంబర్లు శ్రీ జటాసిద్ధేశ్వర సరస్వతీ స్వాములవారి సమాధి స్థానంలో లింగ ప్రతిష్ఠాపన చేయాలని 1974లో నిశ్చయించుకున్నారు. 10 సం.ల అవిరళ అహర్నిశ కృషి సల్పి పాదరస లింగాన్ని ప్రతిష్ఠాపించడంలో వీరు సఫలీకృతులైనారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇదే ప్రప్రథమ పాదరస లింగమని చెప్పవచ్చును ఆశ్రమ అధ్యక్షులు రసవాదుల్ని పిలువనంపి రెండు నెలలు అహర్నిశలు కృషిసల్పి రుద్ర మంత్ర జపములతో 7 కే జీ ల పాదరసాన్ని మూలికాదులతో ఘనీభవింప జేసి లింగాకృతిగా మార్చారు. ఈ లింగం 14 సెం మీ ఎత్తు, 25 సెం. మీ. చుట్టుకొలత కలిగి యున్నది పాణిపట్టాన్ని మరియు నందీశ్వరుణ్ని నల్లరాతితో రాణిబెన్నూరు (కర్నాటక)లో తయారు చేయించారు

ఇలాంటి పాదరసలింగాన్ని శ్రీ జటాసిద్ధేశ్వర పాదరసలింగం అనెడి పేరుతో రాయదుర్గంలోని బళ్లారిరోడ్డులో గల శ్రీ రాజవిద్యాశ్రమములో తేది 6-2-1984న వైదిక కర్మ రీత్యా ప్రతిష్ఠించారు

–జయసుమన్

శ్రీ రాజ విద్యాశ్రమము - రాయదుర్గం



# ఇద్దరి పిల్లల మధ్య మూడు సంవత్సరాల ఎడాన్ని ఉంచండి



నిరోధ్ | 'కాపర్ టి' | ఓరల్ పిల్




ఏ పద్ధతినైనా ఎంచుకోండి

davp 84/225



# విశ్వాసం

ఆమె ఎంగిలి చేత్తో కాకి నదలించదని ప్రతీతి.

వాడికీ తెలుసు ఆమె మెతుకు రాల్చదని.

అయినా, వాడికి తెలిసిందీ, ఆమెకు తెలియందీ మరొకటుంది! అది ఆ యింటి కుక్కపిల్ల!

ఆకుక్క కోసమే వాడా యింటికి రోజా వస్తుంటాడు. కొద్దిసేపా గేటుదగ్గిరే నుంచుని, దాని వెండి కడ్డీలోంచి, ఆ కుక్కపిల్లని చూస్తుంటాడు.

చిన్నగా, బొద్దుగా ఉండే ఆ బొచ్చుకుక్కంటే, వాడి కెంతో యిష్టం! వాడికి మల్లేనే దాని మొహాన బొచ్చు వ్రేలాడుతుంటుంది పట్టు కుచ్చుల్లా దాంతో ఆడుకోవాలని వాడికి అంతరాంతరాల్లో కోరిక!

వాడూరకే ఏయింటి దగ్గరా నుంచోడు. అలా ఊరకేనుంచుంటే దొంగంటారని వాడమ్మ చెప్పింది.

"అమ్మా!.... ఆకలి!.... అన్నం!...." అంటూ అరుస్తుంటాడు. ఆ అరుపులు వాడివో, వాడి ప్రేగులవో అర్థం కాదు.

వాడికి వయస్సు మూడేళ్ళే! కానీ, అనుభవం నాలుగేళ్ళు! తల్లి గర్భంలోనే వాడికాకలి తెలుసు. ఆహారం దొరక్క గిలగిలా తన్నుకోడం తెలుసు. అర్థాకలితో జీవించడమూ తెలుసు.

వాన్నిలోకంలోకి లాగాక, గుక్కపెట్టి ఏడ్వడమూ, ఏడ్చి, ఏడ్చి నిద్రపోవడమూ తెలుసుకున్నాడు. ఆపైన చలికీ, ఆకలికీ, ఎండకీ సర్దుకుపోవడం నేర్చుకున్నాడు. తల్లి చంకలోనే లోకుల తిట్లు, శాప నార్థాలు జీర్ణించుకున్నాడు.

అలా వాడికి మొట్ట మొదట తెలిసింది 'ఆకలి' తరువాత 'అమ్మ' ఆపై 'కసిరే లోకం.'

అందుకే వాడికి వయసుకు మించిన అనుభవం!

ఆరోజు కూడా మామూలుగా వాడు ఆ యింటి



గన్ను కృష్ణమూర్తి

# ప్రేమ్ సబ్బుతో స్నానం
# రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మరియు ఆకుపచ్చ
రంగులలో లభించును.



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA